శ్రీ పైడిపాటి లక్ష్మణకవి విరచిత

# ఆంధ్రనామ సంగ్రహము

సటీక

*Commentator*

ఉభయభాషా ప్రవీణ

చెన్నుభట్ల వేంకటకృష్ణ శర్మ, P. O. L.

*STOCKISTS:*

**S. Appalaswami & Sons,**

**Book-Sellers & Publishers,**

**RAJAHMUNDRY.**

శ్రీ పైడిపాటి లక్ష్మణకవి విరచిత

# ఆంధ్రనామ సంగ్రహము

సటీకముగా

ఉభయ భాషాప్రవీణ

చెన్నుభట్ల వేంకటకృష్ణశర్మ, P. O. L. గారిచే

వ్రాయఁబడినది.


పబ్లిషరు:

టి. బాలనాగయ్యా శెట్టి,

బాలసరస్వతీ బుక్కు డిపో,

ఎడ్యుకేషనల్ పబ్లిషరు,

కర్నూలు.




1945

[వెల 0-10-0

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఉపోద్ఘాతము

భాషాజ్ఞానము నభివృద్ధిపఱుచుటకుఁ బర్యాయపదముల తెలివిడి గొప్ప సహకారి. ఒకేమాటఁ బలుమా రుపయోగించుటవలని వెగటుఁదనము నిది వాపును. ఇట్టి సహకారము నొసంగినది ప్రప్రథమమున నమరకోశము. దానికిం బిదప హారావళీత్యాది గ్రంథములు వెలువడి యథోచితసహాయము నొసంగినవి. కేవలము పర్యాయపదము, వాగ్వైఖరినిఁ బెంపొందింపవు. క్రియాపదములు సంగల కవసరము. వీనిఁ గూర్చి సంస్కృతమునఁ జెప్ప నుద్గ్రంథము లున్నవని విజ్ఞు లెఱుంగుదురు.

పై గ్రంథము లాంధ్రమందలి తత్సమపదప్రయోగమునకు శరణ్యములైనవి. 'ముక్కుకు ముక్కు' గాకుండినను, కొలదిపాటి మార్పులతో నవి మన బాసయందు నాణాలును' వృద్ధిగఁ జేసినవి. కాని యాంధ్రభాషకు స్వాతంత్ర్యము నొసంగ దేశ్యము లవసరమైనవి. వానిఁ గూర్చి శ్రీ పైడిపాటి లక్ష్మణకవి యాంధ్రనామసంగ్రహమును రచించెను. ఇందులకితని కమరకోశము మార్గదర్శకమై యుండవచ్చును. నిజము పరికింప నీ పదసముదాయమున కవసరము ప్రబంధకవుల కాలము (1450 - 1650) వఱకుండునది కాదని తోచుచున్నది. వారు ప్రజ్ఞానిధులు. తరువాతి కవు లనుకరణవ్యాధికిం గుఱియైరి. అందుచే వారి కిట్టి నిఘంటువు లవసరమై యుండును. అటులనినంత, 1650 మీద నుపజ్ఞ కవితాశక్తి, పదపాటవము లేని కవులుండిరని విమర్శకు లనకుందురు గాక. అదియుఁగాక పైడిపాటి లక్ష్మణకవి కాల మమరసింహుని కాలమువలె నూహలపై నాధారపడునదగుట 1650 కి లోపుగ నితఁ డుండలేదని చెప్పఁ బైయంశము ప్రతిపాదింపఁబడినది.

శ్రీరామాయనమః.

శ్రీ పైడిపాటి లక్ష్మణకవి విరచిత

# ఆంధ్రనామ సంగ్రహము

సటీకము

క. శ్రీపతివంద్యు విశాలా
క్షీపతినిభజించి యిష్టసిద్ధులువరుసన్
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీపాదంబులకు నెఱఁగి చెందినవేడ్కన్. 1

కవి శంకరభక్తుఁడు. కవులు తాము రచించునది సంపత్కరముగనుండ నాశింతురు. కాఁబట్టి వారు శ్రీకారముతోఁ దమ కావ్యముల నారంభించుట సరిపాటి. అందుచే లక్ష్మణకవియు, లక్ష్మీనామముతోనే, కృతి నారంభించుచున్నాఁడు. కాని యితని ప్రయోజనము సొగసుగ నున్నది. లక్ష్మి కధిపతియైనవానికి వంద్యుఁడైనవాఁడు. కాబట్టిఁ తనకుఁగాని తనకృతికిఁగాని సన్మంగళములనీయుటలో సందియమేమియుండును. ఒక్క సంపదయేగాదు, కవి విశాలాక్షీపతి యని బోధించిన యన్నపూర్ణ భుక్తిదాయిని. అట్టి కాంతకుఁ బతిని భజించుచున్నాఁడు. ఈ రెండుపదములతో మంగళములును భుక్తియు లభించునని భజించి=సేవించి, ఇష్టసిద్ధులు=(అణిమాద్యష్ట) సిద్ధులు (ఇఁక నివియేగదా వాంఛనీయములు) వరుసన్=క్రమముగ, వ్యాపింపఁగన్=పొందించుటకు, గణనాథుని=ప్రమథగణముల కధిపతియై విఘ్ననివారకుఁడైన, గణపతియొక్క, శ్రీపాదంబులకున్=మంగళకరములైన పాదములకు, ఎఱఁగి=నమస్కరించి; చెందిన=వారి యనుగ్రహమునఁ గలిగిన, వేడ్కన్=ఉత్సాహముతో (క్రిందిపద్యముతో నన్వయము).

ఎట్టులైన నేమి యాంధ్రభాష సంస్కరింపఁబడినమీద దాదాపౌరు శతాబ్దముల కీ గ్రంథము బయలుదేరియుండును. ఇదియుఁ బెరుగుచుండిన భాషకుఁ జాలినది రాకపోగా, ఆంధ్రనామశేషము నడిదము సూరన వ్రాయవలసినవాఁడయ్యెను. సూరన కితఁడు పూర్వుఁడని యీ కవిని పదునేఁడవ శతాబ్దమునఁ జేర్పనగును. ఈ కవిసత్తముఁడు ఏకామ్ర మంత్రి పుత్రుడనియు, నారువేల నియోగియనిమాత్రము మనకుఁ దెలియ నవకాశమున్నది.

కవుల పుట్టుపూర్వము లెటులుండినను మన ప్రాథమిక పాఠశాల లందలి విద్యార్థుల కిది తప్పనిసరిగ బోధింపబడవలసిన గ్రంథమని యాంధ్రభాషాభిమాను లెవరైన ననకపోరు.

ఈ గ్రంథమునకుఁ బ్రస్తుతము టీక వ్రాయుటలోఁ జూపిన మార్పులను, అవసరములను బ్రశంసించుటో, గర్హించుటో చదువరులకు వదలి, విద్యార్థుల కత్యంతోపయోగమగుటకుఁ దోఁచినరీతిని టీక వ్రాయ గమకించితిని. ప్రమాదజనిత స్ఖాలిత్యములకుఁ బండితలోకమునకు సహజమగు క్షమయే శరణ్యము.

కర్నూలు<br>
మార్గశీర్షము, తారణ.

భాషాసేవకుఁడు,<br>
చె॥ వేంకటకృష్ణ శర్మ.

శ్రీరామాయనమః.

శ్రీ పైడిపాటి లక్ష్మణకవి విరచిత

# ఆంధ్రనామ సంగ్రహము

సటీకము

శ్రీపతివంద్యు విశాలా
క్షీపతినిభజించి యిష్టసిద్ధులువరుసన్
బ్రాపింపఁ గణనాథుని
శ్రీపాదంబులకు నెఱఁగి చెందినవేడ్కన్. 1

కవి శంకరభక్తుఁడు. కవులు తాము రచించునది సంపత్కరముగనుండ నాశింతురు. కాఁబట్టి వారు శ్రీకారముతోఁ దమ కావ్యముల నారంభించుట పరిపాటి. అందుచే లక్ష్మణకవియు, లక్ష్మీనామముతోనే, కృతి నారంభించుచున్నాఁడు. కాని యితని ప్రయోజనము సొగసుగ నున్నది. లక్ష్మి కధిపతియైనవానికి వంద్యుఁడైనవాఁడు. కాబట్టిఁ దనకుఁగాని తనకృతికిఁగాని సన్మంగళములనీయుటలో సందియమేమియుండును. ఒక్కసంపదయేగాదు, కవి విశాలాక్షీపతి యని బోధించిన యన్నపూర్ణ భుక్తిదాయిని. అట్టికాంతకుఁ బతిని భజించుచున్నాఁడు. ఈ రెండుపదములతో మంగళములును భుక్తియు లభించునని భజించి=సేవించి, ఇష్టసిద్ధులు=(అణిమాద్యష్ట) సిద్ధులు (ఇఁక నివియేగదా వాంఛనీయములు) వరుసన్=క్రమముగ, ప్రాపింపఁగన్=పొందించుటకు, గణనాథుని=ప్రమథగణముల కధిపతియై విఘ్ననివారకుఁడైన, గణపతియొక్క, శ్రీపాదంబులకున్ = మంగళకరములైన పాదములకు, ఎఱఁగి=నమస్కరించి; చెందిన=వారి యనుగ్రహమునఁ గలిగిన, వేడ్కన్=ఉత్సాహముతో (క్రిందిపద్యముతో నన్వయము).

క. నతభక్తలోకరక్షా
రతికిన్ జంచత్కృపాత । రంగితమతికిన్
శతమఖముఖసురనుతిసం
గతికిన్ మహిమోన్నతికిని । గాశీపతికిన్. 2

నతభక్తలోక=నమస్కరించిన భక్తుల సమూహమును, రక్షారతికిన్=రక్షించు నపేక్షగలవానికి, చంచత్=ప్రకాశించు, కృపాతరంగిత=దయయను నలలుగలదిగాఁ జేయఁబడిన, మతికిన్ = మనస్సుగలవానికి, శతమఖముఖ=నూఱుయాగములు సలిపిన యింద్రుఁడు మొదలగు, సురనుతి=దేవతలస్తోత్రములచే, సంగతికిన్=కూడినవానికి, మహిమోన్నతికిన్=మహిమచే గొప్పనైనవానికి, కాశీపతికిన్ = కాశీవిశ్వనాథునకు. (క్రిందిపద్యముతో నన్వయము).

తే. అంకితమొనర్తుఁ దెనుఁగుపే । ళ్ళరసికూర్చి
గరిమతో నాంధ్రనామ సం । గ్రహమనంగ
నమరుకృతిఁ బైడిపాటి । యేకామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ । సుజనహితుఁడ. 3

పైడిపాటి ఏకామ్రమంత్రిసుతుడన్=పైడిపాటి ఏకామ్రమంత్రి కుమారుఁడనై, కవిలక్ష్మణాఖ్యుఁడన్=లక్ష్మణకవియను పేరుఁగలవాఁడను, సుజనహితుడన్=సజ్జనులకుఁ గావలసినవాడనైన నేను, తెనుఁగుపేళ్లు=తెనుఁగునందలి పేళ్లను, అరసికూర్చి=సంగ్రహించియొకచోఁజేర్చి, ఆంధ్రనామసంగ్రహమనంగన్ = ఆంధ్రనామసంగ్రహమను పేరుతో, అమరుకృతిన్ = ఒప్పునటువంటి గ్రంథమును, అంకితమొనర్తున్=సమర్పించుచున్నాను. భగవదర్పిత మొనరించి కవి ధన్యుఁడయ్యెను.

ఈ కవి తండ్రి యేకామ్రమంత్రియనియుఁ దా నీశ్వర భక్తుఁడనియు, సుజనులకు మిత్రుఁడనియు దెలిపి తృప్తినందుచున్నాఁడు.

తననుగూర్చి మఱేమియుఁ జెప్పికొనక పోవుట స్వయం ప్రకర్షలేమిని జూపుచున్నది.

తే. దేవమానవస్థావర ॥ తిర్యగాఖ్య
వర్గులొనరింతు నానార్థ ॥ వర్గుఁగూడ
వర్గములుగాఁ గూర్తు నా ॥ హ్వాయములందు
నిడుదు వివరించునెడల సం ॥ స్కృతపదంబు. 4

ఈ రచనమునందు, లక్ష్మణకవి సాధ్యమైనంతవఱకు నమర కోశము ననుకరించి, దేవాదివర్గములలో వ్రాసియున్నాడు. అందుఁ దా నేవేవి వ్రాసినదియు నిందుదహరించుచున్నాఁడు. దేవ మానవ, స్థావర, తిర్యక్ + ఆఖ్య = దేవతలు, మానవులు, స్థావరములు, (నగులు కొండలు) తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) అను పేళ్లుగల, వర్గులు = పదసముదాయములను, ఒనరింతుఁ = వ్రాయుదును. నానార్థ వర్గు = ఒకే పదమునకుఁ బెక్కర్థములు గల పదసముదాయమును, కూడఁ = చేరగా, వర్గములు కాఁగ = అయిదు విభాగములు కలుగు నట్లుగా, కూర్తుఁ = రచింతును, ఆహ్వాయములందు = విషయ వివరణము నందు; సంస్కృత పదంబు = సాంస్కృతిక పదమును, ఇడుదుఁ = ఉంతును.

క. శ్రీలలనాధిపవంద్య వి
శాలాక్షీప్రాణనాథ ॥ శతముఖముఖ ది
క్పాలాభీష్టద సమధిక
శీలా కాశీనివేశ ॥ శ్రీవిశ్వేశా. 5

శ్రీలలనాధిపవంద్య = లక్ష్మీదేవికి నాయకుఁడైన విష్ణునిచే నమస్కరింపఁబడువాఁడా! విశాలాక్షీ ప్రాణనాథ = విశాలాక్షికి భర్తయైన వాఁడా! శతముఖముఖ = ఇంద్రుఁడు మొదలైన, దిక్పాలాభీష్టద = దిక్పాలుర కోర్కులఁదీర్చువాఁడా! సమధిక శీలా = మిక్కిలి గొప్పదైన ప్రవ

ర్తనఁ గలవాఁడా! కాశినివేశ=కాశినివాసముగాఁ గలవాఁడా! శ్రీవిశ్వేశా=సంపత్కరుఁడవైన విశ్వనాథా! నా గ్రంథమును చిత్తగింపవలయును, అని కవి తనయిష్టదైవమును బ్రార్థించుచున్నాఁడు.

## దే వ వ ర్గ

దేవతలకు సంబంధించిన పదసముదాయము. Words pertaining to the Devas.

సీ. ముక్కంటి యరపది · మోముల వేలుపు
మినుసిగదయ్యంబు · మిత్తిగొంగ
గట్టువిల్తుఁడు కఱ · కంఠుఁడు మిక్కిలి
కంటిదేవర బేసి · కంటివేల్పు
వలిమలల్లుఁడు మిన్ను · వాకతాలుపు కొండ
వీటిజంగము గుజ్జు · వేల్పుతండ్రి
వలరాజుసూడు జ · క్కులతేని చెలికాఁడు
బూచులరేకిమీఁడు · పునుకతాల్పు
తే. విసపుమేఁతరి జన్నంపు · వేఁటకాఁడు
బుడుతనెలతాల్పు వెలియాల · పోతురాతు
తోలుదాలుపు ముమ్మొన · వాలుదాల్పు
నాఁగ భవదాఖ్యలొప్పు (నం · ధకవిపక్ష). 6

అంధకవిపక్ష=అంధకాసురునకు శత్రువైనవాఁడా! ముక్కంటి=మూడు + కన్నులుగలవాడు (త్రిలోచనుఁడు), అరపది మోముల వేలుపు=అయిదుముఖముల దేవుఁడు (పంచాననుఁడు), మినుసిగ దయ్యంబు=ఆకాశముజొట్టుగాఁగల దైవము (వ్యోమకేశుఁడు), మిత్తిగొంగ=మృత్యువునకు శత్రువు (మృత్యుంజయుఁడు), గట్టువిల్తుఁడు=మేరుధనువుగాఁగలవాఁడు,

(మేరుధ్వని), కఱకంఠుఁడు=నల్లని కంఠముగలవాఁడు (నీలకంఠుడు), మిక్కిలికంటిదేవర= ఎక్కువగాఁ గన్నుగలదైవము, వేసికంటివేల్పు= మూడు కన్నులుగలవాఁడు (అసమనయనుఁడు, వలిమల[2] + అల్లుఁడు= హిమాలయమున కల్లుఁడు, మిన్నుటాక తాలుపు=ఆకాశమందలి నదిని ధరించినవాఁడు (గంగాధరుఁడు), కొండవీటి జంగము = కొండనివాసము గాగల బిచ్చగాఁడు, గుజ్జువేల్పుతండ్రి=వినాయకుని తండ్రి, వలరాజు సూడు=మన్మథునిశత్రువు(మదనారి), జక్కులఱేని చెలికాడు=యక్షుల రాజైన కుబేరుని మిత్రుఁడు. (యక్షేశసఖుఁడు) బూచులదొకిమీడు= పిచాచములకు నాయకుఁడు (భూతేశుఁడు), పునుకతాల్పు=బ్రహ్మకుండిన యైదవతల త్రెంచి యా కపాలమును ధరించినవాఁడు (కపాలభృత్తు), విసపుమేతఁరి[3]=విషమును తినినవాడు, జన్నంపు[4] వేటకాఁడు=దక్షుని యజ్ఞమును ధ్వంసము చేసినవాఁడు (క్రతుధ్వంసి), బుడుతనెలతాల్పు= చిన్నినెలను తాల్చినవాఁడు (బాలేందుశేఖరుఁడు) వెలియాలపోతు రౌతు=తెల్లని యెద్దువాహనముగా గలవాఁడు, తోలుదాల్పు=వ్యాఘ్ర (గజ) చర్మము ధరించినవాఁడు, ముమ్మొన (మూడుమొనలుగలది)వాలు తాల్పు=శూలమును ఆయుధముగాఁ బట్టువాఁడు (శూలి) నాగఁ= అనఁగా, అంధకవిపక్ష=చీకటిగొంగ ! భవదాఖ్యలు + ఒప్పు=నీ పేరు లగును. Lord Siva.

సీ. సోఁకుమూకలగొంగ కొ చుట్టుగెదువుజోదు
పచ్చవిల్తునితండ్రి కొ లచ్చిమగఁడు

1, మహాకవి ప్రయోగమగుట నిది గ్రాహ్యమయ్యెను.

2. అత్తునకు సంధి వైకల్పికము.

3. మేత + అరి. మతుబర్థకమునందు 'అరి' వర్ణకంబు జాలాదుల కగు.

4. కర్మధారయము నందలి ముువర్ణమునకు పుంపులగు. (విసపు మేఁతరి)

పులుఁగుతత్తడిరౌతు ♦ వలమురితాలుపు
వెన్నుఁడు కఱివేల్పు ♦ వెన్నదొంగ
నునుగాడ్పుదిండి పా ♦ నుపున బండెడుమేటి
బమ్మదేవరతండ్రి ♦ తమ్మికంటి
పదివేసములసామి ♦ పసిఁడిపుట్టముదాల్పు
కఱ్ఱినెచ్చెలి తరి ♦ గట్టుదారి

తే. యాలకాపరి వ్రేఁతల ♦ మేలువాఁడు
పాలకడలల్లుఁడును బక్కి ♦ డాలుఱేఁడు
ఱేయుబవలును జేయుక ♦ న్దోయివాఁడు
మామమాఁమన హరియొప్పు ♦ (శ్రీమహేశ) 7

సోకుమూఁకలగొంగ=రాక్షసులకు శత్రువు. (దైత్యారి) చుట్టుఁ[1]గైదువు జోదు=చక్రాయుధముగల వీరుఁడు (చక్రపాణి), పచ్చవిల్తుని తండ్రి=మన్మథునకు దండ్రి, లచ్చిమగఁడు=శ్రీపతి. పులుగుతత్తడి రౌతు=గరుడుఁడు వాహనముగాఁ గలవాఁడు. (గరుడవాహనుఁడు) వలమురి తాలుపు= పాంచజన్యము ధరించువాఁడు, వెన్నుడు=(విష్ణు శబ్దభవము) అంతట నిండియుండువాఁడు, కఱివేల్పు = నల్లని దైవము; వెన్నదొంగ=కృష్ణావతారమున వెన్న నపహరించెను గనుక, నవనీత చోరుఁడు, నునుగాడ్పు=మెల్లనిగాలిని, తిండి = తిను పామును, పానుపునఁ బండెడుమేటి=పఱుపుపైఁ బఱుండువాఁడు. (వాతాశనశయనుఁడు), బమ్మదేవర తండ్రి=బ్రహ్మదేవుని జనకుఁడు, తమ్మికంటి[2]=పద్మనేత్రుఁడు. (పుండరీకాక్షుఁడు), పదివేసములసామి=దశావతారముల నెత్తిన దేవుఁడు. (స్వామి ప్ర. సామి వికృతి) పసిడిపుట్టముదాల్పు=

---

1 ఊదంత స్త్రీసమంబులకుఁ బుంపులకు నుగాగమము.

2. కన్నులు గలవాఁడనుటకు బహువ్రీహ్యాచ్ఛికమున కంటి యగుట గమనించునది (ముక్కంటి).

పచ్చనిబట్టఁ గట్టినవాఁడు (పీతాంబరుఁడు), కఱ్ఱి నెచ్చెలి[1]=అర్జునునకు మిత్రుఁడు, తరిగట్టు దారి=మందరము ధరించినవాఁడు (మందర మొకప్పుఁడు దేవరాక్షసులచే కవ్వముగాఁ జేయబడినది కొన తరిగట్టనఁబడెను. ధారిశబ్ద భవము దారి యని గ్రహింపవలెను, ఆలకాపరి[2]=గోపాలుఁడు. వ్రేఁతల మేలువాఁడు=గొల్లపడుచులకుఁ బ్రియమైనవాఁడు, (గోపికా వల్లభుఁడు), పాలకడలల్లుఁడు=క్షీరసముద్రమునకు లక్ష్మిని పెండ్లియగుట నల్లుఁడు. పక్కిడాలు ఱేఁడు=పక్షి జెండాపై గలవాఁడు (గరుడధ్వజుఁడు), రేయు[3]బవలును జేయు[4]కన్దోయివాడు — రాత్రింబగళ్లు సేయు సూర్యచంద్రులు కన్నులుగా గలవాఁడు! మామమామ - తన మామకు మామయైనవాఁడు. (లక్ష్మినిచ్చిన సముద్రునకు, తన బిడ్డయగు (విష్ణుపది) గంగ నిచ్చి మామయయ్యెను) అనఁగా=అనగా, హరిజుప్పఁగా=విష్ణువు అగును. శ్రీమహేశ-శివుని సంబోధనము (అమరసింహునివలె నీ కవియుఁ గృష్ణనామములు పెక్కు విష్ణున కొసెంగననుట గమనింపఁ దగు).

సీ. పక్కిడాల్వేలుపు ♦ పాక్కలి పసిబిడ్డఁ
డంచ తేజీనెక్కి ♦ యాడురౌతు
మనెడుప్రొద్దులనొస ♦ ళ్ళను వ్రాయుదేవర
చదువుల వేలుపు ♦ జన్నిగట్టు

1. కవ్వడి ప్ర-కఱ్ఱి-వి-నెఱ + చెలి-ప్రాతాదుల యాద్యక్షర శేషములకు పరుషసరళములు పరమగునపుడు మీఁది హల్లునకు ద్విత్వము.

2. ఆవు ప్రభృతులకు బహువచనము పరంబగునపుడు తుదిపదమునకు లోపము విభాష. అవులు-ఆలు.

కడలల్లుఁడు=కడలి + అల్లుఁడు. ఇత్తునకు సంధి బహుళము. (సాధుత్వము విచార్యము)

3. ద్వంద్వంబుపైనాది పరుషములకు సరళము. 4. ప్రాతాదుల కార్యము.

తెలిదమ్మిగద్దియఁ ǂ గొలువుండు రాయఁడు
నిక్కపుజగమేలు ǂ నేర్పుకాఁడు
కడుపుబంగారు బొ ǂ క్కసముఁ జేసినమేటి
పోరోగిరముతిండి ǂ పోఁతుతండ్రి
ఆ. నలువ తమ్మిచూలి ǂ నలుమొగంబుల వేల్పు
వేల్పుపెద్ద పలుకు ǂ వెలఁదిమగఁడు
తాత బమ్మ యన వి ǂ ధాతనామములొప్పు
(నఘవినాశ యీశ ǂ యభ్ర కేశ). 8

పక్కిడాల్వేలుపు=గరుడుఁడుధ్వజము గాగలదేవుఁడు, పొక్కిలి=(పద్మమువంటి) బొడ్డునందలి; పసిబిడ్డ=చిన్నబిడ్డఁడు, అంచెతేజీనెక్కియాడురైతు=హంసవాహనముపై విహరించువాఁడు. మనెడు ప్రొద్దులు=ఆయుఃకాలమును, నొసల్లనువ్రాయు దేవర=ఫాలములందు లిఖించు దేవుఁడు. చదువుల వేలుపు= విద్యలకునికిపట్టగు దేవుఁడు, జన్నిగట్టు=జన్నిదము తాల్చినవాఁడు, తెలిదమ్మిగద్దియ[1]=తెల్లతామరయను సింహాసనముపై, కొలువుండు రాయండు=సభచేయు నాయకుఁడు, నిక్కపు జగమేలు నేర్పుగాడు=సత్యలోకము నేలు నిపుణుఁడు, కడుపు బంగారు బొక్కసముచేసిన మేటి=ఉదరమునుబంగారమున కునికిపట్టు గావించినవాఁడు (హిరణ్యగర్భుడు), పోరోగిరము తిండిపోతు తండ్రి=కలహాశనుఁడగు నారదునకు జనకుఁడు, నలువ[2] = నాలుగు వర్ణములఁ జేసినవాఁడు, తమ్మిచూలి=పద్మమునుండి పుట్టినవాఁడు (పద్మగర్భుఁడు) నలు[1] మొగంబుల వేల్పు=నాలుగుముఖముల దేవుఁడు, వేల్పు పెద్ద-దేవతలలో మొదటివాఁడు (సురజ్యేష్టుఁడు) పలుకు వెలది మగడు-సరస్వతీపతి (వాక్పతి), తాత-తండ్రులకు తండ్రి (పితామహుఁడు,) అనఁగా-

1. పదాంత ఎత్వమునకే యాగామము.

2. సమాసంబునందలి నాలుగునకు నలువర్ణకంబగు.

అనగా, అఘవినాశ=పాపముల నశింపఁజేయువాఁడా!, ఈశ=లోక నాయకా! అభ్రకేశ=ఆకాశము జుట్టుగాగలవాఁడా, విధాతనామములు=బ్రహ్మపేళ్లు, ఒప్పన్=తగియుండును. Lord Brahma.

తే. గట్లరాయనిపట్టి ముక్కంటి వెలఁది
యేనుఁగులగొంగతత్తడి నెక్కుదంట
సామిసామేనిఁ జేకొన్న చాన జగము
తల్లి యన గౌరిపేళ్లొప్పు (ధరనుమేశ). 9

ధరన్=లోకమునందు, ఉమేశ=పార్వతీధవా! గట్లరాయనిపట్టి=కొండల కధిపతియగు హిమవంతునిబిడ్డ (శైలేంద్రసుత) ముక్కంటి వెలది=త్రిలోచనుని భార్య, ఏనుగులగొంగ=ఏనుగులకు విరోధియగు సింహమును, తత్తడి=గుఱ్ఱమును, ఎక్కుదంట=ఎక్కుడు నిపుణురాలు, సామి సా[1]మేనిఁ జేకొన్నచాన=నాథుని సగము దేహముగొనిన స్త్రీ, జగముతల్లి=లోకజనని, (ఈపేరు లక్ష్మికిఁ జెల్లును. "లోకమాతా," మాయని యమరము) అనన్=అనగా, గౌరిపేళ్ళు=గౌరీదేవి పేళ్ళు ఒప్పును. Parvathi.

తే. లచ్చి కలుములజవరాలు పచ్చవిల్తు
తల్లి కటివేల్పు నిల్లాలు తల్లితల్లి
కడలి కూఁతురు సిరిలిబ్బి పడతి తమ్మి
యింటిగరితన శ్రీ యొప్పు (మృగధరాంక). 10

లచ్చి=లక్ష్మిశబ్దభవము, కలుముల జవ[2]రాలు=సంపదలిచ్చు స్త్రీ, పచ్చవిల్తుతల్లి=, మదనునితల్లి, కటివేల్పు ని[3]ల్లాలు=నీలాంగుఁడగు విష్ణుని

1. సగముమేను, సామేను. సాబాలిత్యాదులు ప్రయోగమునుబట్టి గ్రాహ్యము. 2. పేదాదులకాలు శబ్దము పరంబగునపుడు రుగాగమము. 3. షష్ఠీ తత్పురుషమందలి ఉకారఋకారముల కచ్చుపరమగునపుడు నుగాగమము.

భార్య, తల్లితల్లి=(మామమామ యన్నటు లివియుఁ బ్రత్యేకార్థము గలది), లోకమునకుఁ దల్లి గంగ, ఆమెపుట్టిన విష్ణునికిభార్య, కడలి కూతురు=క్షీరోదధి తనయ, సిరి=శ్రీశబ్దభవము, లిబ్బిపడతి=ధన రూపిణియైనస్త్రీ, తమ్మియింటిగరిత=పద్మమునందుండు కాంత (పద్మాలయ) (ఇట గరిత+అన=గరితన అసాధువు) అనఁగ=అనగా. శ్రీ ఒప్పుఁగ=లక్ష్మియగును. Laxmi.

క. తలవాఁకిటను మెలంగెడు
పొలఁతుక పలుకుల వెలంది ॥ పొత్తముముత్తో
నలువపడఁతి కలుములపై
దలికోడలనంగఁ బరఁగు ॥ (ధర) వాణి (శివా). 11

ధరఁగ=లోకమున, శివా!=శివుఁడా!, వాణి=సరస్వతీదేవి. తలవాఁకిటను మెలంగెడు పొల[1]తుక=తలకు వాకిలి వంటిదగు నోరు నివాసముగాఁగల స్త్రీ, పలుకులవెలంది=మాటలిచ్చుదేవత=(వాణి) పొత్తము ముత్తో=పుస్తకముగల ముత్తైదువ, నలువపడతి=బ్రహ్మకు నిల్లాలు, కలుములపైదలికోడలు=లక్ష్మికిఁ గోడలు, అనంగఁ=అనగా, పరఁగు=ఒప్పును. Saraswathi.

సీ. ఇద్దఱుతల్లుల ॥ ముద్దుబిడ్డఁడు పని
చెఱుపులదొర చేట ॥ చెవుల వేల్పు
వంకరతొండంబు ॥ వాఁ డేనుఁగు మొగంబు
దేవరపాపజం ॥ డెములమేటి
మ్రొక్కువారల పనుల్ ॥ చక్కఁజేసెడు సామి
గఱికపూజల మెచ్చు ॥ గబ్బివేల్పు
ముక్కంటిపండుల ॥ మెక్కెడితిండీఁడు
ముక్కంటిగారాబు ॥ ముద్దుపట్టి

1. పొలతాదులకు సుకవర్ణకంబగు.

తే. పెద్దకడుపువేల్పు పిళ్ళారి కుడుముల
తిండికాఁడు కొక్కు తేజిరౌతు
గుజ్జువేలు నొంటి కొమ్ముదేవర వెన
కయ్య యన వినాయ కాఖ్య (లీశ). 12

ఇద్దఱుతల్లులముద్దుబిడ్డఁడు=గంగాపార్వతులకు ప్రియమైన కుమారుఁడు (ద్వైమాతురుఁడు) పనిచెఱుపులదొర=పనులఁ బాడుచేయు రాజు (విఘ్నేశుఁడు) చేటచెవుల వేల్పు=ఏనుఁగుచెవులుఁగల దేవుఁడు. (గజకర్ణుఁడు) వంకరతొండంబువాఁడు=వంపుదిరిగిన తుండమువాఁడు (వక్రతుండుఁడు) ఏనుఁగుమొగంబు దేవర=ఏనుఁగు ముఖముగలదేవుడు (గజవదనుడు) పా[1]పజంబెముల మేటి=పాములు జన్నిదముగా గల వాఁడు, మ్రొక్కువారల పనుల్ చక్కఁజేసెడుసామి = నమస్కరించు వారి కార్యముల నిర్వర్తించువాఁడు, గఱికపూజల మెచ్చు గబ్బివేల్పు= కేవలము గఱికతో పూజించిననే తృప్తుడగుదేవుఁడు, ముక్కంటి పండులు=టెంకాయలు, మెక్కెడి తిండీఁడు=ఎక్కువగా దినువాఁడు. (కుడుములు దినుట జగద్విదితముకాని టెంకాయలు దినుట విచార్యము.) ఏనుఁగుముఖముగలిగియుండుట ఎలకకాయలుదినుటసంభవము) ముక్కంటి గారాబు ముద్దుపట్టి=ఈశ్వరునకు మిక్కిలిగూర్చెడు కుమారుఁడు, పెద్దకడుపువేల్పు=పెద్ద పొట్టగలదేవుఁడు (లంబోదరుఁడు) పిళ్లారి, ఇది యఱవలెక్కు డుపయోగించునామము) కుడుముల తిండికాఁడు[2]=కుడుముల తినువాఁడు, కొక్కుతేజిరౌతు=కొక్కే వాహనముగా గల వాఁడు. గుజ్జువేల్పు=పొట్టిదేవుఁడు, ఒంటికొమ్ముదేవర = ఒకదంతము గలవాఁడు-(ఏకదంతుఁడు). వెనకయ్య (వినాయకశబ్ద భవమేమో), అనన్=అనగా, ఈశ!= ఓశంకరా!, వినాయక + ఆఖ్యలు=వినాయకుని పేళ్లు. Elephant-headed God.

1. సామ్యాదుల కనుమ్యాదుల కుపజ్ యగు,(పాము + జంబెము-పాపజంబెము) 2 ఆటాదులకు పుంస్త్వస్త్రీత్వంబులకాఁడు, కత్తెలగు.

సీ. పెనుఁబాఁపకవణంబుఁ ǂ దినువారువము రౌతు
గట్టులయెకిమీని ǂ పట్టిపట్టి
తెల్లుచూ లార్గురు ǂ తల్లుల కొమరుండు
గాడుపుసంగడి ǂ కానికొడుకు
పుంజుదాలువు వేలు ǂ పులతేనిదళవాయి
జంటముమ్మోముల ǂ దంటవేల్పు
కొంచగుబ్బలివ్రక్క ǂ లించిన బలు దిట్ట
రెండాఱుచేతుల ǂ దండిమగఁడు
తే. వేలుపులమూఁక పేరి ǂ వెలఁదిమగఁడు
వేల్పుగమికాఁడు వెనకయ్య ǂ వెనుకవాఁడు
కొమరుసా మన సేనాని ǂ కొమరుమిగులు
(విగతభవపాశ కాశీని ǂ వేశయీశ). 13

విగతభవపాశ=వదలింపబడు పుట్టుకయను త్రాళ్లుగలవాడా! (పుట్టుక లేనటు సల్పువాడు) కాశీనివేశ = కాశి నివాసముగా గల వాడ! ఈశ=ఈశ్వరా! పెనుఁబాపకవణఁబు౯=పెద్దసర్పమును కబళ మును, తినువారువము రౌతు=తినునట్టి నెమలివాహనముగా గలవాడు, గట్టులయెకిమీని పట్టిపట్టి=కొండల నాయకుడగు హిమవంతుని బిడ్డ యగు పార్వతికుమారుడు, తెల్లుచూలు=తెలుగడ్డిలో బుట్టినవాడు-(శరజన్ముడు), ఆర్గురుతల్లుల కొమరుఁడు=ఆర్గురు కృత్తికలకు బుట్టిన వాడు (షాణ్మాతురుడు) గాడుపుసంగడికానికొడుకు = అగ్ని కొమ రుడు (అగ్నిభవుఁడు), పుంజుదాలుపు=కోడిని జండాపై గలవాడు, వేలుపులతేని దళవాయి = ఇంద్రుని సేనానాయకుఁడు. జంటముమ్మో ముల దంటవేల్పు=రెండుమూళ్లు వదనములుగల దేవుఁడు-(షడాననుఁడు) కొండగుబ్బలివ్రక్కలించిన దిట్ట=క్రౌంచపర్వతమును పరశురామునితోడి పందెములో తొఱ్ఱచేసినవాడు - (క్రౌంచవిదారణుఁడు) రెండాఱు

చేతుల దండిమగఁడు = పంద్రెండు చేతులుగల మహావీరుఁడు, వేలుపుల మూకపేరిటి = దేవతలసేన పేరుగల దేవసేనయను, వెలదిమగఁడు = స్త్రీకి పతి; వేల్పుగమికాఁడు = దేవతల సేనకుఁ బతి, వెనకయ్యవెనుకవాఁడు= వినాయకుని తర్వాత పుట్టినవాఁడు, కొమరుసామి=కుమారస్వామి శబ్దభవము. అనఁగ = అనగా, సేనాని = షణ్ముఖుఁడు, కొమరుమిగులుఁగ = ఒప్పును. The Commander of the Devas.

సీ. అలరువిల్తుండు క ǂ న్నులవిల్తుఁడును గమ్మ
విలుకాఁడు చక్కెర ǂ వింటివాఁడు
చెఱకువిల్కాఁడు కెం ǂ జిగురుల విల్తుఁడు
వెడవిల్తుఁడును బచ్చ ǂ విల్తుఁడించు
విల్లుదాలుపు తుంట ǂ విలుకాఁడు తియ్యవి
ల్కాఁడును జమిలిము ǂ క్కాలినారి
విలుకాఁడు చౌవంచ ǂ ములుకులుగలదంట
రాచిల్క నెక్కుఁడు ǂ రాయరౌతు

తే. మీనుమొసలిసిడంబుల ǂ మేటి చంద
మామయల్లుఁడు వలరాజు ǂ మరుఁడు లచ్చి
కొమరుఁ డనుపేళ్ల నొప్పును ǂ గుసుమధన్వి
(విగతభవపాశ కాశీని ǂ వేశయీశ). 14

అలరువిల్తుఁడు=పూవులే విల్లుగాఁ గలవాఁడు (పుష్పధన్వుఁడు); కన్నుల విల్తుఁడు=గణుపులుగల (చెఱకు) ధనస్సుగాఁ గలవాఁడు; కమ్మవిలుకాఁడు = చక్కెరవింటివాఁడు = తీయనైన చెఱకు ధనువుగాఁగల వాఁడు (ఇక్షుధన్వుఁడు). కెంజిగురుల[1] విల్తుఁడు=ఎఱ్ఱనైన చిగురుటాకులు

1. కెంపు + చిగురు — కెంజిగురు — ప్రాతాదుల లుప్తశేషములకు పరుషసరళములు పరంబులగునపుడు నుగాగమంబు, నుగాగమమున కిట

ధనువుగాఁ గలవాఁడు; వెడవిల్తుఁడు = తేలికైన ధనువు గలవాఁడు; ఇంచు[1]విల్లుఁ జాలుపు = చెఱకును విల్లుగా ధరించువాఁడు; తుంట విలుకాఁడు=చెఱకుతుంటను విల్లుగాఁ గలవాఁడు; తియ్యవిల్కాఁడు=తీయని విల్లుగలవాఁడు, జమిలిముక్కాలినారి విలుకాఁడు=మూఁడుజంటల కాళ్లు గల తుమ్మెద లల్లెత్రాడుగాఁగల విల్లుగలవాఁడు; చౌకంచములుకులుగల దంట = అయిదు బాణములుగల జోదు (పంచబాణుఁడు); రాచిల్క నెక్కుడు రాయరౌతు = రాచిలుకను వాహనముగాఁగల రాజాశ్వికుఁడు; మీను మొసలి సిడెంబుల మేటి = చేప మొసలి టెక్కెమున గుర్తులుగాఁ గల ప్రోడ; చందమామయల్లుఁడు=చంద్రునియల్లుఁడు. వలరాజు=వలపునకు నధిపతి; మరుఁడు=మన్మథుఁడు. లచ్చికొమరుఁడు=లక్ష్మీదేవి కుమారుఁడు. అనుపేర్ల=అనుపేళ్ళతో; కుసుమధన్వి=పూవిలుకాఁడు; ఒప్పను. Cupid.

సీ. చలువలఱేఁడు వెన్నెలఱేఁడు రేఱేఁడు
జాబిల్లి రేవెల్గు చందమామ
తమ్ముల పగవాఁడు ; కమ్మవిల్తునిమామ
కలువలఱేఁడు పాల్కడలిపట్టి
జక్కవకవవిప్పు ముక్కంటి తలపువ్వు
చుక్కలదొర ప్రొద్దు జోడుకోడె
తపసికన్నాపబి త్తరిజింక తాలుపు
కఱివేల్పుడాకన్ను కడలివెన్న
తే. పంటపైరులయొకిమీఁడు జంటదంట
చౌకములపాళ్ళ తెలిముద్ద చలివెలుంగు
వేలుపులబువ్వ చీఁకటి వేరువిత్తు
నెలయనఁగఁ జంద్రు పేళ్ళొప్పు (నీలకంఠ). 15

1. ఇక్షు(ప్ర)-ఇంచు(వికృ)

నీలకంఠ = నీలమైన మెడగల శంకరా! చలువలఱేడు = చల్లదనముల కధిపతి; వెన్నెలఱేడు=వెన్నెలల కధిపతి, రేఱేడు=రాత్రికిఁబతి; జాబిల్లి=(జాను + బిల్లిక)=అందమైన బింబము; రేవెల్గు [1] (రేయి + వెలుగు) = రాత్రి వెలుతురు నిచ్చువాఁడు; చందమామ = చంద్రమాశబ్దభవము. తమ్ములపగవాడు = తామరలకు శత్రువు (జలజారి); కమ్మవిల్తునిమామ=మన్మథుని తల్లితోఁ బుట్టినవాఁడు; కలువలఱేడు=కలువల వికసింపఁజేయువాఁడు; పాల్కడలిపట్టి=పాలసముద్రమున నుదయించినవాఁడు; జక్కవకవ విప్పు = చక్రవాక దంపతుల విడదీయువాఁడు; (చక్రవాకములు పగలు, చకోరములు రాత్రి విహరించును). నుక్కంటితలపువ్వు = శివుని తలపైని పూవువంటివాఁడు (చంద్రశేఖరుఁడు). చుక్కలదొర = ఉడుపతి; ప్రొద్దుజోడుకోడె=(బ్రధ్నభవము ప్రొద్దు). సూర్యునితో (వెలుతు రిచ్చుటలో) సముఁడు, తపసి కన్పాప = తపస్వికంటిపాప (అత్రినయనములనుండి పుట్టినవాఁడని భావము); బిత్తరిజింకతాలుపు=అందమైన ఇఱ్ఱిని ధరించినవాఁడు; కఱివేల్పుడాకన్ను=నల్లనిదేవుఁడగు విష్ణుని యెడమకన్ను; కడలి వెన్న=పాలసముద్రమునకు వెన్నవంటివాఁడు; పంటపైరుల యెకిమీడు=పైరులకు రాజు (ఓషధీనాథుఁడు), జంట దంట చొకములపాళ్ళ తెలిముద్ద = రెండు రెండుల (నాలుగు) నాలుగు నాలుగుల (పదునాఱు) భాగములుగల తెల్లనిముద్ద (చంద్రుఁడు షోడశకళలుగలవాఁడు); చలివెలుంగు=శీతకరుఁడు (చల్లని వెలుగునిచ్చువాఁడు); వేలుపుల బువ్వ=దేవతల యాహారమైనవాఁడు (చంద్రుని కళలు పదునైదును దేవతల కాహారము); చీకటి వేఁటునిత్తు = చీకటిని పోఁగొట్టువాఁడు; నెల = మాసమున కొకసారి మార్పునందువాఁడు; అనఁగా. చంద్రుని పేళ్ళగును. The Moon.

సీ. వెన్నునివలకన్ను ౼ వేఁడి వేలుపు ప్రొద్దు
తోవలరాయిడికాఁడు ౼ పవలు సేయు

---

1. ప్రాంతాదులు తొలియచ్చుమీఁది వర్ణంబులకు లోపము.

వేలుపు పచ్చగు ఱ్ఱాలవజీరుండు
వేఁడివెలుంగు రే వెల్గుజోడు
జంటాఱుమేనుల సామి చీఁకటిగొంగ
యెఱ్ఱనివేలుపు నివముసూడు
చదలుమానికముప్రాఁ జమువుల పెట్టియ
యేడుగుఱ్ఱముల తే రెక్కుజోదు
మువ్వేలుపులయిక్క మ్రొక్కుల దేవత
గాముల ఱేఁడు జక్కవల ఱేఁడు
వేయిచేతుల ఱేఁడు వెలుఁగుల రెకిమీఁదు
చెయువుల సాకిరి చాయమగఁడు

తే. మింటి తెరువరి తమ్మి వాల్గంటిమగఁడు
పోరనీల్గెడు మొనగాండ్రు పోవుదారి
జగముచుట్టంబు జమునయ్య జగముకన్ను
నాఁగ సూర్యుని పేళ్ళొప్పు (నాగభూష). 16

నాగభూష = పాములు భూషణము గాఁగలవాఁడా! వెన్నునివల కన్ను = విష్ణుశబ్దభవము వెన్నుఁడు, ఆతని కుడికన్ను; వేఁడి వేలుపు = వేఁడితనముగల దేవుఁడు; ప్రొద్దు = కాలమును దెలుపువాఁడు; తొవలరాయిడి కాఁడు = కలువలసంకట పెట్టువాఁడు; పవలు సేయు వేలుపు = పగటి కాధారము (దినపతి); పచ్చగుఱ్ఱాల వజీరుండు = పచ్చనిగుఱ్ఱములు రథవాహనములు గాఁగలవాఁడు; వేఁడి వెలుఁగు = వేడితనముగల వెలుతురుగలవాఁడు; రే వెల్గుజోడు = చంద్రునికి పైఁదోడు.; జంటాఱుమేనుల సామి = పండ్రెండు రూపములుగలవాఁడు-(స్వామిభవము-సామి) చీకటిగొంగ = చీకటికిశత్రువు; ఎఱ్ఱని వేలుపు = (అరుణోదయమున) ఎఱ్ఱగనగుపడు దేవుఁడు; ఇవముసూడు = మంచునకు శత్రువు; చదలుమానికము = ఆకాశమునకు మణివంటివాఁడు = (మాణిక్యభవము-మానికము) నభోమణి;

ప్రాఁజదువుల పెట్టియ=వేదములకు మూలమైనవాఁడు - (సూర్యునినుండి వేదములు వ్యాపించెనని కొందరు) - ఏడుగుఱ్ఱములు తేరెక్కు జోదు=ఏడు గుఱ్ఱములుగల రథము నెక్కు వీరుఁడు - సప్తాశ్వుఁడు; ముచ్వేలుపుల యిక్క = బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు నిదానమైనవాఁడు; మ్రొక్కుల దేవర=(ఉదయించినంత నెల్లరచే) నమస్కరింపఁబడువాఁడు; గాముల ఱేడు = గ్రహములకుఁబతి; జక్కవల ఱేఁడు = చక్రవాకముల సంతసింపఁ జేయువాఁడు; వేయిచేతుల ఱేడు=వేయికిరణములుగలవాఁడు; వెలుగుల యెకిమీడు=కాంతులకధిపతి; చెయువుల సాకిరి - కర్మలకుసాక్షి; చేష్ట భవము - చెయువు (భిక్షబికిరమైనటు సాక్షి సాకిరియైనదేమో). చాయ మగఁడు=ఛాయాదేవి భర్త (సంజ్ఞతనవంటి స్త్రీనినిర్మించి ఛాయయని పేరిడియుంచిపోయినదఁట); మింటితెరువరి=ఆకాశమార్గమున చరించు వాఁడు (ఇది చంద్రునకు నన్వయించును); తమ్మి వాల్గంటిమగడు=పద్మినీ కాంతుఁడు; పోరనీల్గెడు మొనగాండ్రు పోవుదారి = వీరమరణమందిన వారు సూర్యమండలము భేదించుకొనిపోవుదురుగాన నట్టివారికి మార్గ మైనవాఁడు; జగముచుట్టము = (ప్రకాశమునిచ్చుటచే) లోకమునకు బంధువు; జమునయ్య = (జముని + అయ్య) యమునికిఁ దండ్రి. జగము కన్ను = వెలుతురిచ్చి విషయములు చూపుటచే లోకమునకుఁ గంటివంటి వాఁడు - - (జగచ్చక్షువు). నాఁగ = అనగా; సూర్యుని పేళ్లు ఒప్ప చున్నవి. (చంద్రుని జెప్పి సూర్యుని జెప్పుట విశేషము) Sun

సీ. చట్టుపల్ దెగగట్టఁ | గొట్టెముజెట్టి సూ
అంచులవాలు చే | మించుజోదు
దుగబొట్లపిఱేఁదియై | దుకనుంగవలవేల్పు
పాఱుతపసియింటి | పంచకోడి
యొడలిచూపొడయఁ డె | క్కుడు మొగుల్ గలప్రోడ
నిక్కువీనులజక్కి | నెక్కురాతు

తెల్లయేనుఁగు నెక్కి ✓ తిరిగెడుదొర తూర్పు
మాగాని యేలెడు ✓ మణియకాఁడు

తే. జమిలిచౌవంచపదులు జ ✓ న్నములు సేసి
నట్టివేలుపు సోమాసి ✓ పెట్టుఁజెట్టు
పొట్టితమ్ముఁడు గల్గిన ✓ యట్టివేల్పు
నాఁగ నింద్రుని పేర్కొప్పు ✓ (నాగభూష). 17

చట్టుపల్ దెగగట్టఁగొట్టెడు జెట్టి = కొక్కులు తెగిపోవునటు లొండలఁగొట్టిన వీరుఁడు - (ఒకానొకపుడు పర్వతములు పక్షములుగలిగి లోకబాధనొనరించుచుండ వజ్రముచే పక్షచ్ఛేదన మొనరించెనఁట). నూఱంచుల వాలుచేమించుకోదు = నూఱుమొనలుగల వజ్రాయుధమును చేతగలవీరుఁడు; దుగబొట్లపిఱిఁది యైదుకనుంగవల వేల్పు = రెండు సున్నలుగల యైదు (500) జంటలకన్నులు (1000) గలవాఁడు; పాఱు తపసియింటి పంచకోడి = గౌతమునియింటిముందు కోడియైనవాఁడు (గౌతముని భార్యను అహల్యను ప్రేమించి యాతపసి తెల్లవారకముంద నదికేగునటు చేయఁ గోడియై, యింద్రుఁడు కూసెనఁట. ఆముని దాని నిజముగా భావించి నదికివెడలనితఁడాతనిరూపుతో నామెను రమించెనఁట). ఒడలిచూపాడయఁడు=దేహమంతయుఁ జూపుగలవాఁడు (పైకార్యము నెఱిఁగనలి యామునిశపింప దేహమంతయు బొక్కులుపడెనఁట. ప్రార్థనచే సదయుఁడై యాఋషి యవి కన్నులుగా నితరుల కగుపడునని యను గ్రహించెను). ఎక్కుడు మొగుల్ గలప్రోఁడ=ఎక్కఁదగిన (వాహనము లైన) మేఘములుగల మేటి; నిక్కువీనులజిక్కి నెక్కురౌతు=పైకిలేచిన చెవులుగల (ఉచ్చైశ్రవమను) గుఱ్ఱముపై స్వారిచేయువాఁడు; తెల్ల యేనుగునెక్కి తిరుగెడుదొర=ఐరావతము వాహనమైనవాఁడు; తూర్పు మాగానియేలెడిమణియకాఁడు=తూర్పుపొలము(తూర్పుదిక్కు) పాలించు మణియగారు (అధికారి); జమిలిచౌవంచపదులు = రెండు అయిదుల

పదులు (100) జన్నములు=యజ్ఞములు; చేసినట్టివేలుపు=చేసినదేవుఁడు. (నూఱశ్వమేధములుచేసిన నింద్రత్వము వచ్చునని ప్రమాణము), సోమాసి పెట్టుఁ జెట్టు=సోమయాజులపాలికిఁ గల్పకమువంటివాఁడు;పొట్టితమ్ముఁడు గల్గిన యట్టివేల్పు = వామనునిఁ దమ్మునిఁగాఁగల దేవుఁడు (బలిచక్రవర్తిచేఁ బీడింపఁబడిన దేవతలరక్షింప నదితికోర నామెకుఁ గశ్యపుఁడు వామనునిఁ బ్రసాదించెను). నాఁగ = అనగా; ఇంద్రుని పేళ్ళగును.

Lord of East.

ఆ. నీరుపాపగాలి ౯ నెచ్చెలి యన్నింటి
తిండికాఁడు కప్పుఁ ౯ దెరువుజాడ
యంటరాని వేల్పు ౯ జంటమోములసామి
యగ్గియనఁగనొప్పు ౯ ననలు (డీశ). 18

నీరుపాప = నీటివలనఁ బుట్టినవాఁడు; గాలినెచ్చెలి = గాలికి మిత్రుఁడు; అన్నింటి తిండికాఁడు = అన్నిఁటిని దినువాఁడు (సర్వభక్షకుఁడు); కప్పుఁదెరువుజాడ = నల్లనైనమార్గము పోకడగా గలవాఁడు; అంటరానివేలుపు = (మండుచుండుటచే) తాకుటకు వీలుకానిదేవుఁడు; జంటమోములసామి=రెండుముఖములుగల దేవుఁడు; అగ్గి=అగ్ని; అనగ = అనగా; అనలుఁడు = అగ్నిదేవుఁడు. ఒప్పును — తూర్పున కధిపతినిఁ జెప్పి యాగ్నేయమున కధిపతి నిందుఁజెప్పనైనది.

Lord of South - East.

తే. జమునసైదోడు పెతరుల ౯ సామిజముఁడు
ప్రొద్దుకొమరుఁడు గుదెతాల్పు ౯ పోతుజక్కి
నెక్కి యాడెడుబలురొతు ౯ దక్కిణంపు
సామియన నంతకుం డొప్పు ౯ (శీమహేశ). 19

జమునసైఁదోడు = (యమునాభవము జమున, యశ్లేయముఁడు, జముఁడు.) యమునానదికి నన్న; సూర్యుని ప్రథమకళత్రమువలన యముడు, మనువుయమున పుట్టినట్లు పురాణములు చెప్పును. పెతరుల సామి=పితృదేవతలకధిపతి. (పితరులుభవము-పెతరులు. అశ్లే ప్రియము-పెరియము.) జముఁడు=యముఁడు; ప్రొద్దుకొమరుఁడు=సూర్యునికి సంజ్ఞా దేవివలనఁ బుట్టినవాఁడు; గుదెతాల్పు = గుదియను పట్టుకొనువాఁడు, (దండధరుఁడు ;) పోతుజక్కి-నెక్కి- యాడెడు రౌతు=దున్నను వాహన ముగాఁగలిగి తిరుగువాఁడు; దక్కిణంపుసామి = దక్షిణమున కధిపతి; అనఁ=అన్నచో; అంతకుండు = యముఁడు; ఒప్పుఁ = ఒప్పారును.

Lord of South.

ఆ. మూలజేఁడు సోఁకు ♫ మూకలజేఁడు రే
ద్రిమ్మరీఁడు పొలసు ♫ దిండిపోఁతు
రక్కసుండు నల్ల ♫ ద్రావువాఁడనఁగను
నిర్ఋతిపేళ్లు సెల్లు ♫ (నీలకంఠ ) 20

మూలజేడు = దక్షిణము పడమరల మూలయందుండువాఁడు; సోకు మూకలజేడు=రక్కసుల సేనల నాయకుఁడు; రేద్రిమ్మరీఁడు = రాత్రించరుఁడు ; పొలసు దిండిపోతు = మాంసమును తినువాఁడు. రక్కసుఁడు (రాక్షస శబ్దభవము). నల్లద్రావువాఁడు=రక్తమును త్రాగు వాఁడు. అనగను = అనినచో నిర్ఋతి పేళ్లు, సెల్లుఁ = అగును.

ఆ. మేటినీరుచూలి ♫ మొయితాలుపులసామి
వల్లెత్రాడుదాల్పు ♫ నీళ్ళరాయఁ
డేటిజోఁటిమగల ♫ యొకిమీఁడు పడమటి
దొర యనంగ నొప్పు ♫ వరుణుఁ (డీశ.) 21

మేటి[1] నీరుచూలి మెయితాలుపులసామి=గొప్పవైన నీటియందుఁ బుట్టిన దేహధారుల (జంతువుల) పతి; వల్లెత్రాడు[2] తాల్పు = త్రాడు నాయుధముగాఁ గలవాఁడు (పాశి); నీళ్ళ రాయఁడు = నీటికధిపతి (జలధీశుఁడు); ఏటిబోటి మగల ఎకిమీడు=ఏళ్ళను స్త్రీలభర్తలగు సముద్రములకు రాజు; పడమటి దొర=పడమటి దిక్కున కధపతి; అనంగన్ = అనగా; వరుణుఁడు; ఒప్పు = ఒప్పును. Lord of West.

సీ. వడిగల జింకత ƒ త్తడి నెక్కునెఱరాతు
మేటిపాములమేఁత ƒ నీటితాత
యొడలితాల్పులపిండు ƒ కసు రగుబలియుండు
సోఁకుదయ్యము మింటి ƒ చూలి గాలి
కరువలి తెమ్మెర ƒ గాడ్పుపయ్యెర యొంటి
మ్రాకుల పెనుముప్పు ƒ మబ్బువిప్పు
సురటివీపులఁబుట్టు ♦ సుడిగొట్టు చలినట్టు
బక్కవారల పెను ƒ బాధ యీఁద
తే. అబ్బురపుఁ దియ్యవిలుకాని ƒ నిబ్బరంపు
దెబ్బపోరుల నలయిక ƒ ప్రబ్బుబోంట్ల
గబ్బిగుబ్బల చెమటల ƒ యుబ్బడంచు
గబ్బివాఁడను మారుతా ƒ ఖ్యలు (మహేశ.) 22

వడిగల జింక తత్తడి నెక్కు నెఱరౌతు = వేగముగల, జింకను గుఱ్ఱము, ఎక్కుమేటి=సవారికాఁడు; మేటి పాముల మేత = గొప్ప పాముల కాహారమైనవాఁడు. (పాములు గాలిఁదిని బ్రతుకునని ప్రసిద్ధి); నీటి తాత = నీటికి తండ్రికిఁ దండ్రి (వాయువునుండి తేజము, తేజము నుండి నీరు పుట్టెనని ప్రమాణము) ఒడలితాలుపుల పిండుకున్ = దేహ

1, 2. నీరుచూలి, త్రాడుతాల్పు అనుప్రయోగములు ఔపవిభక్తిక విధిగ్రహింపమిని ప్రయోగింపఁబడినవి. (టి ఆగమము.)

ధారుల సముదాయమునకు (జీవకోటికి); ఉసురగు బలియుండు = ప్రాణముతైన బలశాలి (జగత్ప్రాణుఁడు); సోఁకు దయ్యము = స్పర్శన జ్ఞానమునకు నధిపతి; (స్పర్శనమువలనఁ దెలియఁదగినవాఁడు;) మింటిమూలి (మిన్నుమాలి) ఆకాశమునుండి పుట్టినవాఁడు; గాలి, కరువలి, తెమ్మెర గాడ్పు = చల్లనిగాలి; పయ్యెర = దక్షిణపు వైపునుండి వచ్చుగాలి; ఒంటి ప్రాకుల పెనుముప్పు=ఒంటిగానుండు చెట్లఁ బడగొట్టుటచే నాపదైనవాఁడు; మబ్బువిప్పు = మేఘముల విరియఁజేయువాఁడు; సురటి వీపులఁ బుట్టు=వీవనల వీచుటచేఁ బుట్టువాఁడు; సుడిగొట్టు=సుడిగాలిగానుండువాఁడు; చలినట్టు = చలి పుట్టించువాఁడు. బక్కవారల పెనుబాధ = బక్క చిక్కినవారి కెక్కువ బాధగానుండువాఁడు; ఈఁద = ఈఁదరగాలి; అబ్బురపు = ఆశ్చర్యకరుఁడైన, తియ్యవిలుకాని = మన్మథునియొక్క, నిబ్బరంపు = దృఢమైన; దెబ్బ పోరులన్ =రతిక్రీడలందు; అలయికన్ =అలసటను. ప్రబ్బు=పొందిన, బోంట్ల=స్త్రీలయొక్క, గబ్బి గుబ్బలన్ =బిగువైన పాలిండ్లయందలి, చెమటలుయుబ్బు = చెమట నీటి గొప్పను, అడంచు = అణచివేయు, గబ్బి = ప్రౌఢ. (రతి క్రీడాజనిత స్వేదము నార్పువాఁడు); నాన్ =అనగా. మారుతాఖ్యలు=గాలిపేరులు, చనున్ = ఒప్పును.

(కడపటి దీర్ఘసమాసము నిరుపయోగము. కావ్యశృంగారము తలకెక్కిన మీది వ్రాతయేమో?)

క. మరుదాఖ్య లొప్పుచుండును
ధర వినుమాలి యనసోఁకు దయ్యమనం బ
య్యెరయన గొట్టన నీఁదనఁ
గరువలి యనఁ దెమ్మెరనఁగ గాలియనంగన్. 23

ఈ పద్యము లక్ష్మణకవిగారిది గాక యెవరోచేర్చిన ప్రక్షిప్త భాగమైయుండును.

ధర=భూమిలో, వినుమాలి=ఆకసమునఁ బుట్టినవాఁడు. (ఆకాశాత్ వాయుః[1] అని ప్రమాణము) అనఁ=అనినను; సోఁకు దయ్యము, అనఁ = స్పర్శన దేవతయనినను; పయ్యెర అనఁ=(ప్రయ్యర రూపమే పయ్యెర) పయ్యెరయనినను; గాడ్పు అనఁ = గాడ్పు అనినను; ఈఁద అనఁ = ఈఁదర యనినను; కరువలినఁ=కరువలి యనినను; తెమ్మెర నగఁ = తెమ్మెరయనినను; మరు దాఖ్యలు=గాలి పేళ్లు, ఒప్పుచుండును. Lord of North-west.

క. ముక్కంటి యనుఁగుఁజెలి వడ
చక్కీలిక చాగకాఁడు జక్కులదొర బల్
రొక్కమెకిమీఁడు మానిసి
నెక్కుడువాహనఁగఁ జను ధనేశుం (డభవా.) 24

అభవా = పుట్టుకలేని శంకరా! ముక్కంటియనుగుఁ జెలి=శివునకు మిత్రుఁడు (రావణాదులు లంకలాగుకొనిన మీద శంకరు తపముచే నాశ్రయించి మిత్రుఁడయ్యెను) వడచక్కీలిక = ఉత్తరమునకు నధిపతి (వడగాడ్పనచో వేడిగాలియగును. వడచక్కి అనుచో నుత్తరమను నర్థము వ్యంగ్యము); చాగకాఁడు=త్యాగశాలి (త్యాగమునకుఁ జాగమని మహాకవిప్రయోగము. అది వికృతియగును); జక్కులదొర=యక్షేశుఁడు. బల్రొక్కమెకిమీఁడు = ఎక్కువ ధనముగలవాఁడు. (రొక్కమునకు + ఎకిమీఁడుసంధి గమనింపవలెను) మానిసి నెక్కుడువాఁడు = నరుఁడే వాహనముగాగలవాఁడు (ధనముమీది వాంఛ మానవులకేయని చూపుటకీ వాహనత్వము) అనగ, ధనేశుండు = కుబేరుఁడు. చనఁ = ఒప్పును. Lord of North.

---

1. కొలనాద్యములకు బహువచనమున కుక్ యగు, కొలను కొలకులు, ద్రాను ద్రాకులు.

క. విడిముడి గలవేలుపు చెలి
జడముడి జంగంబు గడదె ॥ సంగాపరి యా
యొడయండు పాఁపతొడవుల
నిడిమొడి వేల్పనగ నొప్పు ॥ నీశానుఁ డిలన్. 25

ఇలన్ = లోకమున; విడిముడిగల=ధనముగల, వేలుపు [1] చెలి = దేవుడగు కుబేరుని మిత్రుఁడు; జడముడి జంగంబు = జడలుముడిగాగల బిచ్చగాడు. (జోగి జంగమను జాతీయము గ్రాహ్యము); కడదె సంగాపరి యా=ఎనిమిదవ దిక్కుగాచువాఁడైన, ఒడయండు= నాయకుఁడు(అష్టమ దిక్పాలకుఁడు) పాఁప తొడవుల నిడిమొడి(పాము + తొడవు) పాము లేసొమ్ములుగా ధరించు, వేల్పు=దేవుఁడు, అనగన్=అనిన, ఈశానుడు; ఒప్పును = అగును.

(ఈ పద్యమున శంకరునే కవి యీశానునిగాఁ దలంచి సంబుద్ధి కూడ మాని వ్రాసినాడు. ఈశానశబ్దము శంకరునకున్నను ఈశ ఐశ్వర్యేయని యైశ్వర్యయుక్తుఁడని చెప్పఁబడినది గాని దిక్కునిలేదు. ఏకాదశ రుద్రులను గణదేవత లీదిక్కున కధపతులని యందురు. రుద్రనామ సామ్యత వేషమునుబట్టి ధరించిరి కాఁబోలు. ఏదెటులైన శంకరునికి దిక్పాలకత్వమీయుట పొరబాటు.) Loid of North-East.

క. దేవాల యాహ్వయంబులు
కోవెలయన దేవళంబు ॥ గుడి నా వెలయున్
దేవళ్ళన జేజేలనఁ
గా వేలుపు లనఁగ వెలయు ॥ గ్రతుభుగభిఖ్యల్. 26

కోవెలయనన్ = కోవెలయనినను; దేవళంబు; గుడి; నాన్ = అనగా; దేవాలయాహ్వయంబులు = దేవాలయపుఁ బేళ్లు. Temple.

1. ఉదంత స్త్రీ సమకార్యమిటు వదలఁబడినది.

వెలయుఁగా=ఒప్పును; దేవళ్ళు + అనఁగా = దేవళ్ళు అనినను; జేజేలు; అనఁగాఁ, వేలుపులు; అనఁగా, క్రతుభుగఖ్యలు = యజ్ఞములందాహారము దిను దేవతల పేళ్ళు; వెలయును. Celestial Beings.

ఆ. క్షితిని పేళ్లు దనరు | సిద్రంపుఁ బెద్ద బల్
పాపఱేఁడు వెన్న | పాను పనఁగఁ
బుడమి తాలుపనఁగఁ | దడవుల నిడుపఁడు
చిలువ ఱేఁడనంగ | శేషునకును. 27

క్షితిని=ప్రపంచమున; సిద్రంపుఁ బెద్ద = కుబుసముగల పాములలో గొప్పవాఁడు; బల్ పాఁపఱేఁడు = గొప్ప పాములరాజు; వెన్న పానుపు (వెన్నుని పానుపు) విష్ణువునకుఁ బడకయైన వాఁడు; పుడమి (ప్ర. పృథివి) తాలుపు=భూమిని భరించువాఁడు; తడవుల నిడుపడు= చాలకాలము జీవించువాఁడు; చిలువఱేఁడు = పాములరాజు; అనఁగన్= అనిన; ఆదిశేషునకు; పేళ్లు తనరు = నామము లొప్పును.

The Serpent King.

క. మరునయ్య తేజి పులుఁగుల
దొర పాముల వేటకాఁడు | తూరుపునాఁ డేల్
దొరబువ్వఁ గొన్నలావరి
గరుటామంతుఁ డన నొప్పు | గరుడుం (డభవా) 28

మరునయ్య తేజి=మన్మథుని తండ్రికి వాహనమైనవాఁడు. పులుగుల దొర=పక్షులకు రాజు; పాముల వేటకాఁడు = సర్పముల వేటాడువాఁడు; తూరుపునాఁడేల్ = తూర్పు దిక్కును పాలించు; దొర బువ్వన్=రాజు నాహారమగు నమృతమును; కొన్నలావరి=అపహరించిన బలశాలి. (తల్లి దాస్యమునీఁగ నితఁడు సర్పములకై యమృతమును హరించెను.) గరుటామంతుఁడు=గరుత్ అనిన ఱెక్కలు, అవిగల వాఁడు. అనన్=అనినచో, గరుఁడుండు, ఒప్పును. King of the Birds.

ఆ. నల్లవలువతాల్పు ॥ తెల్లనిమైదంట
వెన్నదొంగయన్న ॥ వెఱ్ఱినీళ్ళ
మేలువాఁడు దుక్కి ॥ వాలుదాలుపు తాటి
పడగవాఁ డనంగ ॥ బలుఁడు (రుద్ర) 29

ఈ పద్యమువలన నీకవి యమరకోశము ననుకరించెననుట స్పష్టమగుచున్నది:—నల్లవలువ తాల్పు=నల్లని బట్టనుగట్టువాఁడు (నీలాంబరుఁడు); తెల్లని మైదంట=తెల్లని దేహమును ధరించువాఁడు; వెన్నదొంగయన్న=శ్రీ కృష్ణునికన్న; వెఱ్ఱినీళ్ళమేలువాఁడు = పిచ్చి గలిగించు నీళ్ళయిన కల్లు త్రాగుటందు అభిలాషగలవాఁడు; దుక్కి వాలు దాలుపు = నాగలి ధరించువాఁడు (హలాయుధుఁడు); తాటి పడగ వాఁడు = తాటి చెట్టు జండాపైగుర్తుగా గలవాఁడు (తాలాంకుఁడు). అనంగ; బలుఁడు = బలరాముఁడు, ఒప్పును. Balarama.

క. వడముడి యనఁగా గాడుపు
కొడు కన నివి రెండుఁ బేళ్ళ ॥ గున్ భీమునకుం
బుడమిం గఱ్ఱి యనం గ
వ్వడి యన విన్వచ్చుఁడనగ ॥ వాసవి (యీశా) 30

ఈ పద్యమువలనఁ బాండవులందలి భీమార్జునులకుఁ గవి దైవత్వము నొసంగి యమరసింహుని మించినాఁడు. వడముడి, గాడుపు కొడుకు, అనురెండును భీమునకుగ్, పేళ్ళు, అగుగ్=భీముని నామములు. పుడమినిగ్=లోకమునందు; కఱ్ఱి=నల్లనివాఁడు. [1] యనినను, కవ్వడి (సవ్యసాచి శబ్దభవము) అనినను వాసవి ఇంద్రుని కొడుకు అగును.

Bhima and Arjun.

తే. వేలుపులత్రోవ యుప్పర ॥ పీది యాక
సంబు విను విన్ను మిను మిన్ను ॥ చదలు నింగి

1. ధరణి దుర్లభమైన యవదాతవర్ణము కలవాడని భారతము.

దివి మొయిలుదారి చుక్కల ♦ తెరువు బయలు
గాడ్పుతండ్రన నభ మొప్పు ♦ (గరళకంఠ) .. 31

వేలుపుల త్రోవ=దేవతలు పోవుమార్గము ; ఉప్పరవీది = ఆకాశ మార్గము; ఆకసంబు = ఆకాశ శబ్దభవము. విను, విన్ను, మిను, మిన్ను; చదలు, నింగి,దివి, (ద్యుశబ్ద భవము); మొయిలుదారి = మేఘములదారి; చుక్కల తెరువు = చుక్కలు తిరుగుమార్గము; బయలు = ఏమిలేనిది; గాడ్పు తండ్రి=గాలి పుట్టినచోటు; అనన్=అనగా. నభము, ఒప్పును.

The Sky.

తే. వెలయు ధరణిఁ జతుర్దిశల్ ♦ నలుఁగడ లన
నలరు దచ్చికడ లన ది ♦ శాష్టకంబు
దనరు నీరైదుకడలు నా ♦ దశదిశలును
(మౌళిధృతగంగ యంగజ ♦ మదవిభంగ) 32

మౌళిధృతగంగ=శిరముపై గంగనుంచుకొనినవాఁడా! అంగజమద విభంగ = మన్మథుని పొగరడచినవాఁడా! ధరణిన్ = లోకమునందు; చతుర్దిశల్=నాలుగుదిక్కులు, నలుఁగడలు; (నాలుగు+కడలు)అనగా, తనరును; దిశాష్టకంబు = ఎనిమిది ఎక్కులును; దచ్చికడలు, [2] అనగా; తనరును. దశదిశలు=పది దిక్కులును, ఈరైదు (ఇరు+ఐదు) కడలు, నా=అనగా, తనరును.

ఆ. తాటిసిడమువాని ♦ తల్లికూఁతురి బిడ్డ
వెన్ను నడుగుపాప ♦ మిన్నువాఁక
వేల్పుటేఱు గడలి ♦ వెలఁదుక ముత్తోవ
ద్రిమ్మరనఁగ నొప్పు ♦ (దివిజగంగ) 33

---

1. సమాసంబులందలి నాలుగునకు నలువర్ణకంబగు.
2. దంట+చవుకము=(రెండు నాలుగులు) దచ్చవుకము-దచ్చి.

తాటఁసిద్ధమువాని తల్లి = తాటిచెట్టు ధ్వజముగాఁగలభీష్మునికిఁ దల్లి. కూతురుబిడ్డ = సముద్రుని భార్యయగుటఁగంగ లక్ష్మికిఁదల్లి. లక్ష్మి మగడగు విష్ణుని పాదములఁ బుట్టఁబట్టి యామెకుబిడ్డ; వెన్ను [1] నడుగు పాప = విష్ణునిపాదములందుఁ బుట్టినది (విష్ణుపది). మిన్నువాక = ఆకసమునఁ బ్రవహించునది; వేల్పు [2] టేరు. = దేవతలనది; కడలివెలఁదు [3] క = సముద్రునిభార్య; ముత్రోవద్రిమ్మరి = మూడుపాయలై ప్రవహించునది. (ఆకాశమున మందాకినియని, భూలోకమున గంగయని, పాతాళమున భోగవతియని పిలువఁబడును) అనగ; దివిజగంగ = మందాకిని. ఒప్పును. The Ganges.

తే. వేలుపులగౌరు చౌదంతి ॥ వెల్లయేనుఁ
గనఁగ నైరావతంబున ॥ కాఖ్యలమరు
వేల్పుదొరతేజి యనఁగను ॥ వెల్లగుఱ్ఱ
మనగఁ నుచ్చైశ్రవంబొప్పు ॥ నంబికేశ. 34

అంబికేశ=అంబికకుఁ బతియైనవాఁడా! వేలుపులగౌరు = దేవతల యేనుఁగు; చౌదంతి=నాలుగుదంతములుగలది. (దీనికి రెండు తుండములని ప్రసిద్ధి) వెల్లయేనగు=తెల్లనియేనుగు. అనఁగ=అనిన; ఐరావతాఖ్యలు= ఇంద్రుని యేనుగునకుఁ బేళ్ళు; Indra's Elephant. వేల్పు దొరతేజి= ఇంద్రునిగుఱ్ఱము; వెల్లగుఱ్ఱము=తెల్లగుఱ్ఱము; అనగను = అనినను; ఉచ్చైశ్రవంబొప్పు=ఉచ్చైశ్రవమునకుఁ బేళ్ళగును. Indra's Horse.

ఆ. పుష్కుఁదోడుకు వేలు ॥ పులగిడ్డి వెలిమొద
వనఁగఁ గామధేను ॥ వలరుచుండుఁ
గల్పకంబుదనరు ॥ వేల్పుఁజెట్టివుల
మ్రాను వెల్లమ్రాను ॥ నా (నుమేశ) 35

---

1. షష్ఠీతత్పురుష సమాసంబు లందలి యూకార బుకారములకు నుగాగమము. 2. కర్మధారయములందలి ఉత్తునకునచ్చు పరమగుచో టుగాగమము. 3. నెల తాదులకు ఉకవర్ణకము.

పుడుకుఁదోడుకు = కోరికలనిచ్చునావు; (తోడుకనినదొంగ మేత అది కోరునదికొన నావునకోపేరు కలిగినది); వేలుపుంగిడ్డి = దేవతల యావు; అనఁగ = అనిన; కామధేనువు; అలరు; Celestial Cow; వేల్పుఁజెట్టు = దేవతలవృక్షము; ఈవులమ్రాను = కోరికలనిచ్చు చెట్టు. తెల్లమ్రాను = తెల్లనిచెట్టు; నా=అనగా; కల్పకము; తనరు.

Celestial tree.

ఆ. అవని గుదుసుకైదు ౘ వనఁగ వేయంచుల
కైదువనఁగ జుట్టుఁ ౘ గైదువనఁగ
బటువుఁగైదు వనగఁ ౘ బరఁగు సుదర్శన
చక్రమునకుఁ బేళ్ళు ౘ (చంద్రవాళి) 36

అవనిఁ = లోకమున; గుదుసుఁగైదువు=గుండ్రనియాయుధము- చుట్టుఁగైదువు = చుట్టునాయుధముగ నుండునది! బటువుఁగైదువు=బల మైన యాయుధము; వేయంచుల కైదువు = వేయి మొనలుగల ఆయు ధము; అనఁగ = అనిన; సుదర్శన చక్రమునకు = సుదర్శమనఁబడు చక్రము; పేళ్లు; తనరును. Vishnu's weapon (disc).

ఆ. వలమురి యనఁ జుట్టు ౘ వాలుజోడనఁ గల్మి
కొమ్మమగనిబూర ౘ గొమ్మనంగ
దనరుఁ బాంచజన్య ౘ మునకు నభిఖ్యలు
(ధృతకురంగ ధవళ ౘ వృషతురంగ) 37

ధృతకురంగ=లేడినిధరించువాఁడా! ధవళవృషతురంగ= తెల్లని ఎద్దువాహనముగా గలవాడా! వలమురి = కుడివైపునకుఁ దిరిగియుండు నది; చుట్టువాలుజోడు=సుదర్శనమునకు తోడైనది; కల్మికొమ్మమగని బూరగొమ్ము = సంపదలిచ్చు లక్ష్మిదేవి భర్త విష్ణుఁడు గాలినించి వాయించునది; అనగ; పాంచజన్యమునకు అభిఖ్యలు = పేళ్లు.

Vishnu's Conch.

తే. రిక్కలన జుక్క లనఁగను # ఋక్షములకు
నాఖ్యలై యొప్పఁ దెఱగంటి # యన్ను లనఁగ
నచ్చరలనగ వేలుపు # మచ్చెకంటు
లనఁగ సురకాంతలకు నాఖ్య # లగు (గిరీశ.) 38

రిక్కలు=(ఋక్షశబ్దభవము) చుక్కలు అనగా, ఋక్షములకు= నక్షత్రములకు; ఆఖ్యలై = పేళ్లై, యొప్పను. Stars. తెఱగంటి అన్ను లు, అచ్చరలు, వేలుపు మచ్చెకంటులు, అనగ, సురకాంతలకున్ = దేవతా కాంతలకు; ఆఖ్యలు = పేళ్లు.

తే. పవలు పగ లనఁ బేళ్లొప్పు # దివమునకును
రాత్రిపేళ్లొప్పు రే రేయి # రాతి రనఁగ
వెలయుచుండును రేయెండ # వెన్నె లనఁగఁ
జంద్రికకును సమాఖ్యలు # (చంద్రమాళి.) 39

పవలు, పగలు, అనన్ = అనిన; దివమునకున్ = దినమునకు (దివము = ఆకాశము, పగలు) పేళ్లు ఒప్పును; Day. రే, రేయి, రాతిరి. (రాత్రి శబ్ద భవము) అనునవి రాత్రి, పేళ్లు ఒప్పును; Night. రే యెండ, వెన్నెల, అనగన్, చంద్రికకున్ = వెన్నెలకు, సమాఖ్యలు = పేళ్లు, వెలయుచుండును = ఒప్పును. Moonlight.

క. మించు లన మెఱుపు లనఁగను
జంచలలకుఁ బేళ్ళు దనరు # జలధరములు రా
ణించుం బలుకంగ మొయి
ళ్ళంచు మొగుళ్ళంచు మబ్బు # లంచున్ (భర్గా)40

మించులు, అనన్, మెఱపులు, అనగా, చంచలలకున్ = చలించునవగు మెఱుపులకు; పేళ్లు, తనరును. Lightning. మొయిళ్లంచున్, మొగుళ్లు, అంచున్, మబ్బులు, అంచున్, పలుకంగన్ = చెప్పగా; జలధరములు=మేఘములు, రాణించున్=ఒప్పును. Clouds.

క. తొలుచదువులు ప్రాఁజదువులు
తొలుమినుకులు ప్రామినుకులు గ తొలుపలుకులుప్రాఁ
బలుకులు పెనుమినుకులు నా
వెలయున్ శ్రుతులకును బేళ్లు గ (విశ్వాధిపతీ.) 41

తొలుచదువులు = మొదటి చదువులు; ప్రాఁజదువులు = ప్రాత చదువులు; తొలు మినుకులు; ప్రామినుకులు; (మినుకు = మినుకుమను కాంతి; వేగము). తొలుపలుకులు; ప్రాఁబలుకులు; పెను మినుకులు; నా=అనగా; శ్రుతులకును = వేదములకు; పేళ్లు, వెలయును. Vedas.

క. ఇది దేవవర్గు దీనిం
జదివిన వ్రాసినను వినిన గ జనులకు నిత్యా
భ్యుదయంబు లొసగుచుండును
వదలక కాశీనివాస గ వాసుఁడు పేర్మిన్. 42

ఇది ఫలశ్రుతి పద్యము. పూర్వము మనగ్రంథములు తాటాకులపై వ్రాయఁబడి యుండుట నవి శిథిలములగునని వానినెత్తి వ్రాయుటకై వానిగ్రహమునకుఁ బాత్రత యని కవులు కల్పించిరి.

తా. ఈ దేవవర్గును జదివినవారికిని వ్రాసినవారికిని వినినవారికిన్ని కాశీనివాసుఁడైన శంకరుఁడు, ఆదరముతో నిత్యములైన శుభములను వదలక యిచ్చుచుండును.

## మానవవర్గు.

Words pertaining to Human Beings.

తే. పాఱుఁ డనఁగ బుడమివేల్పు ♦ బాపఁ డనఁగ
జన్నిగట్టన విప్రుండు ♦ జగతిఁ బరఁగు
నొడయఁ డేలిక యెకిమీఁడు పుడమిఱేఁడు
ఱేఁడు దొర సామి యన నొప్పు ♦ నృపతిపేళ్లు. 43

పాఱుఁడు, పుడమివేలుపు (ధరాసురుఁడు) బాపడు, జన్నిగట్టు, అనఁగా=అనిన; జగతిఁగా = లోకమున; విప్రుండు, బరగు = ఒప్పును Brahmin. ఒడయఁడు, ఏలిక, ఎకిమీడు, పుడమిఱేఁడు, ఱేఁడు, దొర, సామి (స్వామి శబ్దభవము) అనఁగా, నృపతిపేళ్లు = రాజు నామములు ; ఒప్పును. ఇందు క్షత్రియ వాచకము చెప్పవలసినది. రాజ నామములు చెప్పఁబడినవి. Kshatria (King).

సీ. కోమట్లు మూఁడవ ♦ కొలమువాం డ్రనబేరు
లన వైశ్యనామము ♦ లైనరుఁ; గాఁపు
వాండ్రు నా నాలవ ♦ వాండ్రు నా బలిజెవాం
డ్రనఁ జను శూద్రస ♦ మాహ్వాయములు;
వడుగు నా గోచిఁబోఁ ♦ పఁడు నాఁగ బ్రహ్మచా
రికిఁ బేళ్లు నడచు ధ ♦ రిత్రియందు;
నాలుబిడ్డలు గల యతఁ డిలుఱేఁడు గే
స్తన నొప్పుఁ బేళ్లు గృ ♦ హాధిపతికి;
ఆ. నడవి మనికిపట్టు ♦ జడదారి యన వన
వాసి యొప్పు; నిల్లు ♦ వాసి తిరుగు

బోడ తపసి కావి ♦ పుట్టగోఁచులసామి
యనయతీంద్రుఁ డలరుఁ ♦ (నలికనేత్ర) 44

అలికనేత్ర=నొసటఁ గన్నుగల శంకరా! కోమటులు, మూడవ కొలమువారు, బేరులు, అనఁగ వైశ్యనామములు, తనరు — Vaisyas. కాఁపువాండ్రు, నాలవవాండ్రు = నాల్గవ కులమువారు, బలిజవాండ్రు, నా=అనగా; శూద్రసమాహ్వయములు=శూద్రుల పేళ్లు, చనుఁగ=ఒప్పును. Sudras. వడుగు (వటుశబ్దభవము) గోచిబాపడు = కౌపీనముధరించు వాఁడు; నాఁగఁ = అనిన, బ్రహ్మచారికిఁ = బ్రహ్మచర్యముబూనిన వానికి, పేళ్ళు; Bachelor. ఆలుబిడ్డలుగల యతఁడు, ఇలువేఁడు = ఇంటికినధిపతి; గేస్తు (గృహస్థశబ్దభవము) ధరిత్రియందు = లోకమున, గృహాధిపతికిఁ=గృహస్థునకు, పేళ్లు, ఒప్పును. Familyman; అడవి మనికిపట్టు=అడవియే నివాసముగా నుండువాఁడు; జడదారి (జటాధారి) అనఁగ, వనవాసి = వానప్రస్థుఁడు, ఒప్పును. ఇల్లువాసితిరుగు=ఇల్లునిలేక తిరుగువాఁడు;బోడ=తలబోడి చేసికొనినవాఁడు;తపసి (తపస్విశబ్దభవము) కావిపుట్ట గోఁచులసామి = కావిరంగుగల గోఁచిగలవాఁడు. అనఁగ, యతీంద్రుఁడు = సన్న్యాసి, అలరు. Ascetic.

సీ. అమ్మ నాఁ దల్లి నా ♦ నవ్వనాఁ గన్నది
యన మాతృ కాఖ్యలౌ ♦ (నభ్రకేశ)
అబ్బ నాయన యయ్య ♦ యనఁ దండ్రియన నప్ప
యన జనకాఖ్యలౌ ♦ (నగనివేశ)
తోడఁ బుట్టినఁగ సై ♦ దోడు తోఁబుట్టిన
సోద రాహ్వయము లౌ ♦ (నాదిదేవ)
భర్తృసహోదరు ♦ భార్యకుఁ దోడికో
డ లన నేరా లన ♦ నలరు (నభవ)

తే. చెలియ లనఁ జెల్లె లనఁగను ॥ వెలయుచుండు
నాహ్వయములు కనిష్ఠక ॥ న్యకు (గిరీశ)
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై ॥ క్షితిని వెలయు
నప్ప యన నక్క యనఁగఁ (జంద్రార్ధమకుట) 45

అద్రికేశ=ఆకాశము వెంట్రుకలుగాఁగల వాఁడా! అమ్మ, తల్లి, అవ్వ, కన్నది, అనన్=అనిన, మాతృకాఖ్యలు = తల్లి పేళ్ళు. Mother. నగనివేశ = కొండవాసముగాఁ గలవాఁడా! అబ్బ, నాయన, అయ్య, తండ్రి, అప్ప అనిన, జనకాఖ్యలు=తండ్రి పేళ్ళు; Father. ఆదిదేవ = మొదటిదేవుఁడైనవాఁడా! తోడబుట్టు, సైదోడు, తోఁబుట్టు,[1] అన, సోదరాహ్వయములు అవును = అన్నదమ్ముల పేర్లగును; Brother. భర్తృ సహోదరు భార్యకు = మగని తోఁబుట్టువు పెండ్లము, తోడి కోడలు, ఏరాలు, అని, అలరును; Co-daughter-in-law. కనిష్ఠ కన్యకు = తనకంటె తరువాతఁబుట్టిన కన్యకు; చెలియలు, చెల్లెలు, అనగను, అహ్వాయములు=పేళ్ళు, వెలయుచుండును, Younger sister. జ్యేష్ఠకన్యకున్ = తనకంటె ముందుపుట్టిన యాఁబిడకు, అప్ప, అక్క, అనిన, చంద్రార్ధమకుట = బాలచంద్రుని కిరీటముగాఁగలవాఁడా! జగతి=లోకమున, ఆఖ్యలై = నామములై, వెలయును. Elder sister.

సీ. ముగ్ధకుఁ బేళ్లగు ॥ ముగుద యనన్ ముద్ద
రాలు నా గోల నా ॥ జేల యనఁగ
గట్టివాయి యనంగ ॥ గయ్యాళి యన బాఁగ
యన ధూర్తసతికి నా ॥ హ్వయము లమరు
నైదువ నాఁగ ము ॥ త్తైదువ నా నయి
దువరాలు నాఁ బుణ్య ॥ యువతి వెలయు

1. తోడ + పుట్టువు - ప్రాతాదుల లుప్తశేషములకార్యము.

మృతచిరంటికి నాఖ్య ౯ లెసఁగుఁ బేరంటాలు
నాఁగను జక్కిని ౯ నా ధరిత్రి
తే. గేస్తురా లను నాఖ్యచే ౯ గృహిణి వెలయు
నాలు పెండ్లాము రాణి యి ౯ ల్లాలనంగ
భార్యదనరును; దొత్తన ౯ బానిసె యన
వరపు డన దాసికాఖ్యలౌ ౯ (గరళకంఠ) 46

గరళకంఠ=విషము కంఠమునఁగలవాఁడా! ముగుద, (ముగ్ధశబ్దభవము) ముద్దరాలు,[1] గోల, బేల అనఁగ, ముగ్ధకు - పేళ్ళు, అగును. గట్టివాయి = నోటిబిరుసుగలది, గయ్యాళి, ఱాఁగ, అనిన, ధూర్తసతికి = గడుసుఁదనముగల స్త్రీకి, ఆహ్వానములు=పేళ్ళు - అమరును=ఒప్పును. (ముగ్ధకు వ్యతిరేకము ప్రౌఢ) - ప్రౌఁఢ లోకవ్యవహారము నెఱిఁగి వర్తించునది. ఐదువ, (మంగళసూత్రము, పసుపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు. అను సైదలంకారములుగలది.) ముత్తైదువ (ముత్తు = వృద్ధ) అయిదువరాలు, నాఁ = అనిన, పుణ్యయువతి = పుణ్యాంగన (భర్తగలది) వెలయును; పేరంటాలు; జక్కిని, (యక్షిణి శబ్దభవము) నాఁగను = అనినను, ధరిత్రిఁ=లోకమున, మృతచిరంటికి=చనిపోయిన సుమంగలికి, ఆఖ్యలు=పేళ్ళు, ఎసఁగును = ఒప్పును. గేస్తురాలు (గృహిణిశబ్దభవము.) అను పేళ్ళ గృహిణియొప్పును, ఆలు, పెండ్లాము, రాణి, ఇల్లాలు, అనునవి భార్యపేళ్లు; తొత్తు, బానిసె, వరపుఁడు, అనఁగా, దాసికి = సేవకురాలికి, ఆఖ్యలౌఁ = పేళ్ళగును.

సీ. కన్నియ కన్నెనాఁ ౯ గన్యకుఁ బేళ్ళొప్పు
జవరాలు కొమరాలు ౯ జవ్వని యనఁ
దనరు యువతి; ప్రోఁడ ౯ యన గట్టివయసుది

1. పేదాదుల కాలుశబ్దము పరంబగునపుడు రుగాగమము.

యన ప్రౌఢ దాల్చు నీ – యాహ్వయములు
ముసలి మిండల కోర – ముప్పదియాఱేండ్లు
చనినది యనుపేళ్ల – నెనయులోల;
ముసలిది ముదుసలి – ముదియ పెద్దన నివి
యాఖ్యలై తనరు వృ – ద్ధాంగనకును
ఆ. చెడిపె అంకులాడి – చెడ్డతొయ్యలి వెలి
చవులు గనిన దనఁగ – జారదనరు
విలను విటులదూత – యెడకాఁడు కుంటెన
కాఁడనంగఁ దనరు – (గరళగంఠ) 47

కన్నియ, కన్నె,[1] నాఁ=అనిన, కన్యకు పేళ్ళు,అగును. (కన్య శబ్దభవము కన్నె.) జవరాలు, కొమరాలు, జవ్వనియనిన, యువతి = యవ్వనము గల స్త్రీ, తనరుఁ=ఒప్పును. ప్రోఢ, (ప్రౌఢశబ్దభవము) గట్టి వయసుది[2]=వయసు దిగజాఱినది; అనిన, ఈ యాహ్వయములు=ఈ పేళ్లు, ప్రౌఢ తాల్చును, ముసలి. మిండలకోర = అంకుతనము గలది, ముప్పది యాఱేండ్లు చనినది (ఈపదమునకుఁ బ్రయోగావసరము మృగ్యము) అనుపేళ్ళు, లోల=లౌల్యముగలది, ఎనయును=ఒప్పును. ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద, (పెద్దది) అనగా, ఇవి వృద్ధాంగనకు=ముసలిస్త్రీకి, ఆఖ్యలై తనరు=పేళ్లై యొప్పును.; చెడిపె, అంకులాడి, చెడ్డతొయ్యలి, వెలిచవులు గనినది=ఇతర పురుషుల మఱగినది. అనగ, జార = జారిణి, తనరును. (ముసలి మొదలగు పైఁ జెప్పఁబడిన పదములకు నీపదములకుఁ గల యర్థభేదము గమనింపఁదగినది). విటులదూత = జారుల తార్పుడు కాఁడు, ఎడకాఁడు=అవకాశమును జూచివచ్చువాఁడు, కుంటెనకాఁడు =తార్చువాఁడు — అనగ — తనరును.

---

1. పదాంతమందలి యెత్వమున కి యగాగమంబగు, కన్నె, కన్నియ.
2. ఆపదాది స్వరంబులు పరంబులగునపుడు సంధియగు–వయసు + అది.

తే. వేల్పుబానిసె వెలయాలు ‡ వేడ్కకత్తె
లంజె భోగముచాన వె‡ల్లాటకత్తె
పడపుఁజెలి యాటచేడియ ‡ గడనకత్తె
నాఁగ నివి వేశ్య కాఖ్యలౌ ‡ (నగనివేశ) 48

వేల్పుబానిస (దేవదాసి), వెలయాలు = ధనముచే నాలగునది, వేడ్కకత్తె[1] = వేడుకల గలిగించు స్త్రీ; లంజె, భోగముచాన = (భోగ స్త్రీ) = సుఖములిచ్చునది. వెల్లాటకత్తె=నాట్యమాడునది, పడపుఁజెలి, ఆటచేడియ, గడనకత్తె = సంపాదింప మఱిగినది, నాఁగ = అనగా, ఇవి, వేశ్యకు, ఆఖ్యలు = పేళ్లు. A dancing woman.

ఆ. వెచ్చకాఁడు బొజుఁగు ‡ వేడుకకాఁడు మిం
డండు ననుపుకాఁడు ‡ మిండగీఁడు
లంజకాఁడు నా ధ‡రం జను బల్లవ
నామధేయములు ‡ (పినాకహస్త) 49

పినాకహస్త = పినాకము చేతఁగలవాఁడా! వెచ్చకాఁడు[1]=ధనమును ధారాళముగ వ్యయపఱచువాఁడు; బొజుఁగు = విటుఁడు, వేడుకకాడు= వేడుకలు మఱిగినవాఁడు, మిండఁడు, ననుపుకాడు=స్త్రీకి సులభముగ లోబడినవాఁడు, మిండగీడు, లంజెకాడు, నా = అనిన, ధరన్ = లోకమున, పల్లవ నామధేయములు = ఇతర స్త్రీల మఱిగినవాని పేళ్లు, చనున్ = ఒప్పును. Rake.

గీ. కోడెకాఁడనంగ ‡ గోవాడ నాఁగను
యువజనాఖ్య లొప్పు ‡ చుండు రెండు

---

1. మతుబర్థమునందలి పువాచక స్త్రీవాచకములకు కాఁడు కత్తెలగు.

నాగవాస మనఁగ నామమౌ వేశ్యాజ
నంబుమేళనమునకు (సంబికేశ) 50

కోడెకాఁడు=కోడెవయసు గలవాఁడు, గోవాళ్ళు(గోవ + వారలు) యవ్వనముగలవాడు, అనిన, యువజనాఖ్యలు = యవ్వనవంతుండువారి పేళ్ళు, Youth వేశ్యాజనంబు మేళమునకు = భోగపుస్త్రీల గుంపునకు. నాగవాసమనగ, నామముగును. A party of dancing girls.

సీ. నెలఁతుక క్రాల్గంటి పొలఁతుక ముద్దియ
వాలుఁగంటి మగువ పడఁతి మడఁతి
చెలిమచ్చెకంటి యుగ్మలి యింతి తొయ్యలి
నవలా కలువకంటి నాతి గోతి
పూఁబోఁడి చిగురాకు బోఁడి పైదలి మించు
బోఁడిముద్దులగుమ్మ పొలఁతి కొమ్మ
ప్రోయాలువిద తీఁగె బోఁడి చేడియ యించు
బోఁడి యన్ను వెలంది బోటి జోటి
తే. చాన తెఱవ వెలందుక చామ లేమ
చెలువ యెలనాగ చిలుకల కొలికి కలికి
తలిరుఁబోఁడి యలరుఁబోఁడి నెలఁత పొలతి
గరిత యతివన స్త్రీసమాఖ్యలు (మహేశ) 51

నెలతుక, క్రాల్గంటి=వాలుకన్నుగలది, పొలతుక, (పొలతి + ఉక) ముద్దియ, వాలుగంటి మగువ, పడతి, చెలి, మచ్చెకంటి=చేపలవంటి కన్నులు గలది; ఉగ్మలి, ఇంతి, తొయ్యలి, నవల, కలువకంటి=కలువల వంటి కనులుగలది, నాతి,గోతి, పూఁబోడి[1] (పూవు + మేను)పూవువంటి

---

1. బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేను నకు పోఁడి, బోఁడులగు. ఆపిదప నుగాగమము.

దేహముగలది, చిగురాకుఁబోఁడి = చిగురాకువంటి మేనుగలది, పైదలి, మించుఁబోఁడి= మెఱుపువంటి దేహముగలది, ముద్దులగుమ్మ=మిగులముద్దు సేయఁబడునది, పొలఁతి, కొమ్మ=వృక్షమును కొమ్మవలె పురుషు నాశ్రయించునది, ప్రోయాలు, ఉవిద (యువతిశబ్దభవము) తీఁగబోఁడి=తీగవలె సన్ననైన దేహముగలది, అన్ను, చెలది, బోఁటి, జోటి, చాన, కెలందుక (చెలఁది + ఉక), చామ, లేమ, చెలువ, ఎలనాగ, చిలుకలకొలికి=చిలుకముక్కువంటి కనుకొలకులు గలది, కలికి, తలిరుఁబోఁడి, అలరుఁబోఁడి, నెలత, పొలతి, గరిత, అతివ, నాఁ=అనిన, స్త్రీసమాఖ్యలు=స్త్రీకి పేళ్లు. Woman.

తే. చెలిమి నేస్తంబు పొందు నా ॥ స్నేహమలరు
నెచ్చెలి యనుంగు సంగాతి ॥ నేస్తకాఁడు
సంగడీఁ డనఁ జెలికాఁ డ ॥ నంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు ॥ (శ్రీ మహేశ) 52

చెలిమి, నేస్తము (స్నేహశబ్దభవము) పొందు, నా = అనిన, స్నేహము=మైత్రి, అలరును; Friendship. నెచ్చెలి (నెఱ + చెలి = ప్రాతాదులకార్యము) అనుఁగు, సంగాతి (సాంగత్యశబ్దభవము సంగాతము). నేస్తకాఁడు, సంగడీఁడు, చెలికాఁడు, అనంగ స్నేహితునకు, సమాఖ్యలు=పేళ్ళు, తనరును. Friend.

సీ. దొంగ తెక్కలికాఁడు ॥ దొరకోలు సన్నాసి
ముచ్చెత్తుబడికాఁడు ॥ ముడియవిడుపు
తెరువాఁటుకాఁడు క ॥ త్తెర దొంగ చేవాఁడి
కాఁపు వల్లడికాఁడు ॥ కన్నగాఁడు
మునిముచ్చు గడిదొంగ ॥ యనఁ దస్కరాఖ్యలౌఁ
జెండిపోతు గరాసు మొండికట్టె

టకటొంకు టాటోటు ౯ టక్కులాడు పిసాళి
టక్కరి ముడికాఁడు తవళికాఁడు
తే. కల్లరియు గొంటు కైలాట ౯ కాఁడు చెడుగు
బేరజము కుచ్చితుఁడు దోస ౯ కారి చెనఁటి
పాలసుఁడు నాలిబూతంబు ౯ వలువ తులువ
కూళ గడుసన వర్తిల్లుఁ ౯ (గుజను పేళ్లు) 53

దొంగ, తెక్కలికాఁడు=మోసగించి ధన మపహరించువాఁడు, దొరకోలు సన్న్యాసి=నమ్మించి మోసగించి ధనము హరించువాఁడు; ముచ్చు=మాటలేక హరించువాఁడు; ఎత్తుబరికాడు = ధనమెత్తుకొని పోవువాఁడు, ముడివిడుపు=ధనపుమూట విడుచుకొని పోవువాఁడు; తెరవాటుకాడు=దారిగొట్టువాఁడు; కత్తెరదొంగ=మూటలు సంచులు కత్తిరించుకొనిపోవువాఁడు, చేవాడికాఁడు = (చేయి + వాడి) = చేతి చురుకుఁ గలవాఁడు, వల్లడికాఁడు=కొల్లగొట్టువాఁడు, కన్నగాఁడు = కన్నము వేయువాఁడు, మునిముచ్చు=మునివలె మాటాడకుండి యపహ రించువాఁడు, గడిదొంగ=సామాన్యముగఁ జిక్కనివాఁడు, అనన్ = అనిన, తస్కరాఖ్యలు=దొంగకుఁ బేళ్ళు. Thief or Robber. చెండి పోతు=(చండికనుండి ఏర్పడినది చెండి) విరుద్ధముగ వర్తించువాఁడు, గరాసు=దుష్టస్వభావుఁడు, మొండికట్టె = మొండితనము గలవాఁడు, టకటొంకు, టాటోటు, టక్కులాడు, ఈ మూటికిని మోసకారి, కల్ల నిజము చేయువాడని యర్థము చెప్పఁకోఁదగును, పిసాళి=దొంగయెత్తులు వేయువాఁడు, టక్కరి=టక్కుచేయువాఁడు, ముడికాఁడు = తంటాలు పెట్టువాఁడు, తవళికాఁడు = మోసగాఁడు, కల్లరి = అబద్ధాలవాఁడు; గొంటు=దుష్టత్వముచే నొకరికి లొంగనివాడు, కైలాటకాఁడు=టాటోటు తనమున కలవడినవాఁడు; చెడుగు = చెడుపుచేయువాఁడు, బేరజము (డు)=కృత్రిమపు నడతకలవాఁడు; కుచ్చితుఁడు = (కుత్సితశబ్దభవము)

లోనొకటి వెలుపలనొకటి గలవాఁడు, దోసకారి=పాపములు చేయువాఁడు, చెనటి=మూర్ఖుఁడు, పాంసుఁడు=ద్రోహి, అలిబూతము=(అలికి నాలి యర్థము) నీచమైనవ్యక్తి, పలువ=నోటిబిరుసుగలవాఁడు, తులువ=తుంటరి, కూళ=నీచుఁడు, గడుసు=గడుసైనవాఁడు. అన, కుజను పేళ్ళు=దుర్మార్గుని పేళ్ళు, వర్తిల్లు=ఒప్పును.

Bad or wicked man.

ఆ. పాపబుడుత చిఱుత । పట్టి సిసువు కందు
కూన నిసువు బిడ్డ । కుఱ్ఱ బొట్టె
యనఁగ శిశుసమాఖ్య । లగు గొమరుండు నాఁ
గొడుకు నాఁగుమార । కుండు వెలయు. 55

పాప, బుడుత=చిన్నవాఁడు, చిఱుత, పట్టి=కొడుకు, సిసువు(శిశు శబ్దభవము) కందు, (సెత్తురుకందని ప్రయోగము) కూన, నిసువు, బిడ్డ(డు), కుఱ్ఱ, బొట్టె అనగ, శిశుసమాఖ్యలు = శైశవము దాటనివాని పేర్లు. Child. కొమరుండు, కొడుకు, నా=అనిన, కుమారకుండు=కౌమారము (16 ఏండ్లు) దాటనివాఁడు, లేక పుత్రుఁడు వెలయును. Boy or son.

ఆ. వటుసమాఖ్య లగును । వసుధలోఁ గొండిక
వాఁ డనంగఁ బడుచు । వాఁ డనంగఁ
బిన్నవాఁ డనంగఁ । జిన్నవాఁ డనగను
(వినుతగుణసనాథ) । (విశ్వనాథ) 55

వినుతగుణసనాథ=పొగడఁదగిన గుణములకాశ్రయమైనవాఁడా! విశ్వనాథ!=కాశీ విశ్వనాథుఁడా!, వసుధలో=ధరణిని, కొండికవాఁడు=పడుచువాఁడు, పిన్నవాఁడు, చిన్నవాఁడు, అనగ, వటుసమాఖ్యలు=వివాహముగాని బాలునికి పేర్లు అగును. Youth.

సీ. గిటక పొట్టి కుఱుచ ॥ గిట్ట గుజ్జనఁగ వా
మనుఁ డొప్పుఁ; జను నప ॥ స్మారి పేళ్లు
వెడఁగు వేఁదురు వెఱ్ఱి ॥ వీఱిఁడి వేఱిఁడి
వెంగలి వెంబర ॥ వి త్తనంగఁ
జతురునకు జను పేళ్ళు ॥ జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నే ॥ ర్పరి యనంగ
ప్రన్నని వాఁడు రూ ॥ పరి చూడఁగలవాఁడు
చక్కని వాఁడు నా ॥ జగతిఁ బరఁగు
తే. సుందరాకారవంతుండు ॥ సొగసుకాఁడు
వన్నెకాఁ డన శృంగారి వసుధ వెలయు
నంధకుని పేళ్ళు చీకు గ్రు ॥ డ్డనఁగ మూఁగ
మూవ యన మూకనామముల్ ॥ (దేవ దేవ) 56

గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట, గుజ్జు (కుబ్జశబ్దభవము)=ఎత్తుకు పెరుగనివాడు. అనగ. వామనుఁడు=పొట్టివాఁడు. వెలయును, Undergrown person. వెడఁగు, వేఁగుఱు, వెఱ్ఱి, వీఱడి, ఱఱిడి, వెంగలి, వెంబరవిత్తు, అనగ, అపస్మారి=పిచ్చివాని పేళ్ళు. Mad man. జాణ, దంట, వలంతి=అన్నిట శక్తుఁడు, వెరవరి=ఉపాయము తెలిసినవాఁడు, ప్రోడ (ప్రౌఢశబ్దభవము) నేర్పరి, అనంగ, చతురునకున్=చాతుర్యము గలవానికి పేళ్ళు - Clever or tactful person. ప్రన్ననివాఁడు, రూపరి, చూడఁగలవాఁడు=చూడఁదగినవాఁడు, చక్కనివాఁడు, నా=అనిన, జగతిన్=లోకమున, సుందరాకారవంతుడు=సుందరుఁడు, బరగును - Beautiful Person. సొగసుకాఁడు=సొగసు చేసికొనువాఁడు, వన్నెకాఁడు=వర్ణవర్ణములైన వస్త్రముల ధరించువాఁడు, అనగా, శృంగారి=శృంగారించుకొనువాఁడు. వెలయును — Man of fashion.

చీకు, గ్రుడ్డి, అనఁగ అంధుని నామములు - Blind man. మూఁగ, మూవ, అనిన, మూకనామముల్ = మూగవాని పేళ్లు - Dumb man.

క. కాయము పేళ్లై వెలయును
మే యన నొడ లనఁగ మేను మెయి యనఁ; భోగ
ప్రాయము పేళ్ళఁగు బరువము
పాయము జవ్వన మనంగ (భావజదమనా) 57

భావజదమనా=మన్మథుని హరించినవాఁడా! మే, ఒడలు, మేను, మెయి, అనిన, కాయముపేళ్లై=దేహనామములై, వెలయును - Body. పరువము, పాయము, జవ్వనము (యౌవన శబ్దభవము) అనంగ = అనిన, భోగ్యప్రాయము=సుఖము లనుభవింపఁదగిన వయసు పేళ్లు అగును - Youth.

తే. నెఱులు కురులు వెండ్రుకలు నా నెఱ కలనఁగఁ
గొప్పు తుఱుము మన వేనలి కొప్పెద యనఁ
గేశధమ్మిల్లములు మించుఁ గీలుగంటు
క్రొమ్ముడి యనంగఁ గేశబంధమ్ముగు (భవ) 58

నెఱులు=రమ్యమైనవి, కురులు, వెండ్రుకలు, నెఱకలు, కొప్పు, తుఱుము, వేనలి, క్రొవ్వెద (క్రొత్త + వెద=కొప్పు) అనఁగ = అనిన, కేశధమ్మిల్లములు = (స్త్రీల) వెండ్రుకలముడి, మించుఁగ = ఒప్పును; Women's tuft of hair. కీలుగంటు=జారుముడి, క్రొమ్ముడి[1]= (క్రొత్త + ముడి) అనఁగ - కేశబంధము=వెండ్రుకల ముడికి పేళ్లు.

---

1. క్రొత్తాదుల యాద్యక్షర శేషములకు వ మన=లు పరములైన ద్విత్వము మాత్రము కానంబడును.

తే. నొసలు నెన్నొసల్ నుదుర నె ఽ న్నుదురనంగఁ
దనరు ఫాలంబు; చూడ్కి చూ ఽ పనఁగ నొప్పు
నాహ్వయము లీక్షణమునకు; ఽ నక్షికాఖ్య
లలరుఁ గన్ గను కన్ను నా ఽ (నభ్రకేశ) 59

నొసలు, నెన్నొసలు (నెఱ + నొసలు) నుదురు, నెన్నుదురు (నెఱ + నుదురు) అనగ, ఫాలంబు = ఫాలభాగము, తనరు. Forehead. చూడ్కి, చూపు, అనగ, ఈక్షణమునకున్ = చూపునకు, ఆహ్వయములు = పేళ్లు, Look. కన్, కను, కన్ను (నువర్ణకము ద్రుతమాత్రముగ గ్రహించుటవలన నీ రూపము లేర్పడినవి) నాన్ = అనిన, అక్షికిన్ = కంటికి, ఆఖ్యలు = పేళ్లు-Eye.

క. వీను లనఁ జెవు లనంగా
జానుగు లన నాహ్వయములు ఽ శ్రవణంబులకున్
గౌ నన నడు మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ ఽ (దరుణేందుధరా) 60

తరుణ + ఇందు + ధరా = లేత చంద్రుని ధరించువాఁడా! వీనులు చెవులు, జానుగలు, శ్రవణంబునకున్ = చెవికి, ఆహ్వయములు = పేళ్లు. Ear. గౌను, నడుము, మధ్యమునకు, అభిధానములు = పేళ్లు. Waist.

తే. అక్కు ఱొమ్మెద బోర నా ఽ నలరు వక్ష
మాస్యముల నొప్పుచుండు నా ఽ ఖ్యలు మొగంబు
మోర మో మనఁ బేళ్లొప్పు; ఽ నూరువునకుఁ
బెందొడ యనంగఁ గుఱువు నా ఽ (నందివాహా) 61

అక్కు, (వక్షుశబ్దభవము) ఱొమ్ము, ఎద (హృదయశబ్దభవము), బోర నాన్ = అనిన, వక్షము, అలరును. Chest; మొగము (ముఖము ప్రకృతి) మోర, మోము, అనగా, ఆస్యమునకున్ = ముఖమునకు ఆఖ్యలు

=పేళ్లు, ఒప్పుచుండును, Face; పెందొడ (పెద్ద+తొడ) తుఱువు, నా=అనిన, ఊరువునకు పేళ్లు, ఒప్పును. Lap.

తే. వదనగుహ యొప్పునోరు నా । వాయి యనఁగఁ
బల్లు పలు నాఁగ దంతంబు । పేళ్ళు వెలయు
బెదవి వాతెఱ మోవి య । న్పేళ్ళఁ దనరు
చుండునోష్ఠంబు (శీతాంశు । ఖండమౌళి) 62

నోరు, వాయి, నాన్=అనగా, వదనగుహ = ముఖమునందలి బొరియ, ఒప్పును - Mouth. పల్లు, పలు, నాఁగ=అనినచో, దంతంబు పేళ్లు, వెలయును - Tooth. పెదవి, వాతెఱ (వాయి+తెర)=నోటికి తెరవంటిది, మోవి, యన్పేళ్లన్=అను నామములతో, ఓష్ఠంబు తనరు చుండును, Lip.

క. కయి యనఁగై నాఁ గేలనఁ
జెయి యనఁజై నాఁగఁ జెయ్యి । చేనా హస్తా
హ్వయము లగు (నన్నపూర్ణా
ప్రియవల్లభ కాశికాపు । రీవరనిలయా) 63

అన్నపూర్ణా ప్రియవల్లభ ! = అన్నపూర్ణాదేవికిఁ బ్రియుఁడైన వాఁడా! కాశికాపురీవరనిలయా=శ్రేష్ఠమైన కాశి నివాసముగాఁ గల వాఁడా!, కయి, కై, కేలు, చెయి, చై, చెయ్యి, నాన్=అనిన, హస్తమునకు, సమాఖ్యలు=పేళ్ళు. ఐ, అయిగా మారుట గ్రామ్యము. Hand.

క. ఎద యన డెందం బనఁగా
మదియనఁగా నెడఁ దనంగ । మఱి యుల్లము
నా హృదయమునకు నివి యొనఁగును
విదితంబుగ నాహ్వయములు । (విశ్వాధిపతీ) 64

ఎద, డెందము, మది, ఎడఁద, ఉల్లము, నా=అనగా, ఇవి, విదితంబుగ=నెల్లరకుఁ దెలియునట్లు, హృదయమునకుఁ=(హృదయము) మనస్సునకు, పేళ్లు. ఎసఁగును=ఒప్పును, Mind. (ఆంగ్లమందలి Heart నకుఁ గూడ నివి పర్యాయములుగాఁ జెప్పనగును.)

క. లోఁజెయ్యన నఱచె య్యనఁ
గాఁ జెల్లును బేళ్ళు రెండు కరతలమునకుఁ
మీఁజెయ్యనఁ బెడచెయ్యియు
నాఁ జనుఁ గరచరమభాగ నామములు(శివా) 65

లోఁజెయ్యి(లోన్ + చెయ్యి)=చేతి లోపలిభాగము, అఱచెయ్యి, అన, కరతలమునకుఁ=చేతిలోపలి భాగమునకు, రెండు, పేళ్ళు, Palm. మీఁజెయ్యి=(మీఁది + చెయ్యి) పెడచెయ్యి, నాఁ=అనిన, కరచరమభాగమునకు=చేతి పైభాగమునకు నామములు.

ఆ. పొట్ట డొక్క కడుపు బొజ్జ బొజ్జయనంగ
నొప్పుచుండు నాఖ్య లుదరమునకు
నాభిబిలమునకును నామధేయము లగు
బొడ్డు నాఁగ మఱియుఁ బొక్కి లనఁగ. 66

పొట్ట, డొక్క, కడుపు, బొజ్జ, బొజ్జ, అనగ, ఉదరమునకుఁ= కడుపునకు, ఆఖ్యలు=పేళ్లు, ఒప్పుచుండును. బొడ్డు, పొక్కిలి, అనగ, నాభి బిలమునకును=బొఱియవంటిదైన బొడ్డునకు, నామధేయములు= పేళ్లు. (ఈ పద్యమునందు నిత్యసంధి గమనించి పదములు విడఁదీయ వలయును.)

తే. వెన్ను నంగను వీఁపు నా వెనుక మేను
నాఁగఁ జరమాంగమున కొప్పు నామములుగఁ

బుఱ్ఱ తల పాల నాఁ బున్క పుఱియ నాఁగ
పాలమున కాఖ్యలై యొప్పు ॥ (ఫాలనేత్ర) 67

వెన్ను, వీపు, వెనుక మేను=దేహపు వెనుభాగము, నాఁ=అనిన, చరమాంగమునకున్=వీపునకు, నామములుగ, ఒప్పును. Back. పుఱ్ఱ, తలపాల, పునుక, పుఱియ. నాగన్=అనిన, కపాలమునకు=తల పైభాగమునకు, ఆఖ్యలై ఒప్పున్=పేళ్ళగును. Skull.

క. అడుగంజ హజ్జ యనఁగాఁ
బుడమిఁ బదంబునకు నామ ॥ ములు విలసిల్లున్
మెడ కుత్తుక ట్టు గొంతు తన
నడరు గళంబునకుఁ బే (ళ్ళ ॥ సంగధ్వంసీ) 68

అడుగు, అంజ, హజ్జ, పుడమిన్=లోకమున, పదంబునకు, నామములు, Step. మెడ, కుత్తుక, అట్టు, గొంతు, గళమునకున్=మెడకు, పేళ్ళు, అడరును. Neck.

ఆ. బువ్వ వంటకంబు ॥ బోనంబు మెతుకు కూ
డోగిరము పసాద ॥ మోరె మనఁగ
నన్న మొప్పుఁ; జేల ॥ మలరుఁ బుట్టంబు దు
వ్వలువ చీర కోక ॥ వలువ యనఁగ. 69

బువ్వ, వంటకము, బోనము, (ప్ర-భోజనము) మెతుకు, కూడు, ఓగిరము, పసాదము (ప్ర - ప్రసాదము). ఓరెము, అనగ, అన్నము; ఒప్పును. Food. పుట్టము, దువ్వలువ, చీర, కోక, వలువ, అనగ, చేలము=వస్త్రము, అలరును. Cloth.

తే. మెసవె నారోగిణ మొనర్చె ॥ మెక్కెఁదినియెఁ
గుడిచె నారగించెను బసా ॥ పడియె నమలె

సాపడె ననంగ నొప్పు భో ॥ జనము సేసె
ననుట కిది యాఖ్యలై (యీశ ॥ యభ్రకేశ) 70

మెసవెను, ఆరోగిణ మొనర్చెను, మెక్కెను, తినియెను, కుడిచెను, ఆరగించెను, పసాపడియెను. ప్రసాదము + సాపడు. నమలెను, సాపడెను, అనంగ, భోజనము చేసెననుటకు. ఇవి, ఆఖ్యలు = పేళ్ళు (Ate.)

క. నాన యన సిగ్గు సిబ్బితి
నా నివి వ్రీడాపదంబు ॥ నామంబు లగుం
బానము సేయుట పేళ్ళగు
నానుట త్రావుటనఁ ద్రాగు ॥ టనఁ గ్రోలుటనన్.

నాన, సిగ్గు, సిబ్బితి, నాఁ ఇవి = అను నివి, వ్రీడాపదంబు నామంబులు = సిగ్గనుపదమునకు పర్యాయములు, Shy. ఆనుట, త్రావుట, త్రాగుట (క్వచిద్గకారోవః యని సూత్రము) క్రోలుట, అనగా, (మద్యాదులు) పానము సేయుటకు = త్రాగుటకు, పేళ్ళు - Drinking.

ఆ. తళియ పళ్లెరంబు ॥ తెలె హరివాణంబు
తట్ట కంచ మనఁగఁ ॥ దనరుఁ బాత్ర;
చెల్లుఁ జషకమునకుఁ ॥ బేళ్లు డబ్బుర కోర
గిన్నె యనఁగ (రజత ॥ గిరినివాస) 72

భోజనపాత్రము = భుజించుపాత్ర, తళియ, పళ్ళెరము, తెలె, హరివాణము, తట్ట, కంచము, అనగా, తనరును, Eating plate. డబ్బుర, కోర, గిన్నె అనగా, చషకమునకుఁ = గిన్నెయకు, పేళ్ళు దనరును - Drinking cup.

తే. నతికిఁ బేళ్లొప్పు జోతదం ॥ డము జొహారు
మ్రొక్కు జేజే యనంగఁ; గేల్ ॥ మొగిచెఁగొలిచె

నెఱఁగెఁ జేమోడ్చె నన నమ ! స్కృతియొనర్చె
ననుట కివి యాఖ్యలగు (నీశ ! యభ్రకేశ)   73

నతిక్రియ = నమస్కారమునకు, జోత, దండము, జోహారు, మ్రొక్కు, జేజే, అనగను, పేళ్ళు - Obeisance or Salute. కేల్మొగిచె = చేతులఁజోడించెను, కొలిచెను, ఎఱగెను, చేమోడ్చెను (చేయి + మోడ్చెను) అనగ, ఇవి నమస్కృతియొనర్చెన్ = నమస్కారము చేసెను, అనుటకు, ఆఖ్యలు=పేళ్ళు. Saluted.

తే. ఒప్పు శయనించుటకును బ ! న్నుండె బండె
బవ్వడించెఁ బరుండెను ! బవ్వళించె
నత్తమిల్లె ననన్మఱి ! మెత్త సెజ్జ
పఱుపు పాన్పనఁ దగు శయ్య ! (ఫాలనేత్ర)   74

శయనించుటకును = పరుండుటకు, పన్నుండె, పండెను, పవ్వడించెను (శ, డలకభేదము) పరుండెను; పవ్వళించెను, నత్తమిల్లెను, అనగా, పేళ్ళు, అగును Slept. మెత్త, సెజ్జ (శయ్య - ప్ర) పఱుపు, పాన్పు, అన, శయ్య=పడక, తగును, Bed.

తే. ఒప్పు ధ్వనిపేళ్లు రొద యన ! నులివు నాఁగ
సద్దనంగను గూఁత నాఁ ! జప్పుడనఁగ
నలుకు డన; రోదనము సేసె ననుట కాఖ్య
లెసఁగు నఱచెను వాపోయె ! నేడ్చె ననఁగ   75

ధ్వనిపేళ్ళు=శబ్దమునకుఁ బేళ్ళు, రొద, ఉలివు, సద్దు (శబ్దము-ప్ర) కూఁత, చప్పుడు, అలుకుడు అనగా, తనరును. Noise. అఱచెను. (ఇది బిగ్గఱశబ్దమునకుఁ బేరగును) వాపోయెను = (నోరువిడిచి యఱచెను) ఏడ్చెను, అనగ రోదనముచేసెను=ఏడ్చెను, అనుటకు, ఆఖ్యలు=పేళ్ళు. Cried.

క. అగుఁ బేళ్లు నీరువట్టన
దగ దప్పియు దూప యనఁగ దాహంబునకున్
నగవు నగు నవ్వు నవు నా
నగు నాఖ్యలు హాసమునకు (నగజాధీశా) 76

నగజ అధీశా = పార్వతికిఁ బతియైనవాఁడా! నీరువట్టు, దగ, దప్పి, దూప, అనగ, దాహంబునకున్ = దప్పికి, పేళ్ళు, అగును Thirst. నగవు, నవ్వు, నగు, నవు, నాన్ = అనగ, హాసమునకున్ = నవ్వునకు, ఆఖ్యలు = పేళ్ళు - Laughter.

క. చాగము నాఁ బుడుకనగా
నీగి యనఁగ నిడుట యనఁగ నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నా
ద్యాగమునకు నాఖ్య లగుచు ధరఁబరఁగు (శివా)

చాగము, పుడుకు, ఈగి, ఇడుట, ఈవి, తేగము (త్యాగము-ప్ర) పెట్టుడు (పెట్టుధాతువు) నా=అనగ, త్యాగమునకున్ = ఉదారముగ నిచ్చుటకు, ఆఖ్యలు అగును. Giving.

ఆ. ఎలసె బెరసె హత్తె నెనసె నదికెఁ జెందె
బొందె దొరసెఁ గూడె నొందెఁ జెనకె
ననఁగ సక్తమయ్యె ననుటకు నివి యాఖ్య
లగు (గిరీశ యీశ యభ్రకేశ) 78

ఎలసెను, బెరసెను, హత్తెను, ఎనసెను, అదికెను, చెందెను, పొందెను, దొరసెను, కూడెను, ఒందెను, చెనకెను, అనగా, సక్తమయ్యెను=కూడుకొనెను, అనుటకు, ఇవి, ఆఖ్యలు=పేళ్ళు. Joined.

ఆ. ఎడసెఁ బాసె వేఱు పడెఁ బురివిచ్చె నా
నలరు భేద మయ్యె ననుట పేళ్లు

స్వవశమయ్యె ననుట ॥ కవుఁ బేళ్లు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ ॥ (నసమనేత్ర) 79

అసమనేత్ర = విషమమైన కన్నులుఁగలవాఁడా ! ఎడసెను, పాసెను, వేఱుపడియెను, పురివిచ్చెను = (కలిసియుండి విడిపోయెను) నా=అనిన, భేదమయ్యెన్ = విడిపోయెననుటకు, పేళ్ళు - Separated. లోనయ్యెను (లోపడియెను) అగ్గమయ్యెను = సాధ్యమయ్యెను, అనఁగ, స్వవశమయ్యెను = స్వాధీనమయ్యెను అనుటకు, పేళ్ళు, అవును.
Controlled.

ఆ. అగు గృహీత మయ్యె ॥ ననుటకుఁ బేళ్ళగ
పడియెఁ జేపడియెను ॥ బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ జిక్కె దగుల్పడె
ననఁగ (నగనివేశ ॥ యభ్రకేశ) 80

నగనివేశ = కొండవాసముగాఁగలవాఁడా ! అభ్రకేశ = ఆకసము వెంట్రుకలుగా గలవాఁడా ! అగపడియెను, చేపడియెను, పట్టువడియెను, చిక్కువడియెను, తగిలెను, చిక్కెను, తగుల్పడియెను, అనఁగ, గృహీతమయ్యెను = పొందఁబడియెను, అనుటకు పేళ్ళు, అగును. Got.

తే. అనియె నొడివె వక్కాణించె ॥ నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నా ॥ జను వచించె
ననుట; కాలించె నాలకిం ॥ చెను వినె నన
నలరు నవధరించె నటంట ॥ కాఖ్య (లీశ) 81

అనియెను, నొడివెను, వక్కాణించెను, ఆడెను, చెప్పెను, వినిచెను (వినుచు=వినుపించు) వాక్రుచ్చెను, పలికెను, నాన్=అనిన, వచించెను=చెప్పెను, అనుటకు, ఆఖ్యలై=పేళ్లై, చనుచు; Said. ఆలించెను,

ఆలకించెను, వినెను, అవధరించెను = వినెను, అటంటకు = అనుటకు ఆఖ్యలై అలరును, Heard.

క. కనియెను చూచెను కాంచెను
కనుఁగొనెఁ గన్గొనె ననంగఁ గలయవి పేళ్లై
చను వీక్షించె నటంటకు
(ఘనతరగోరాజగమన ! (కాయజదమనా) 82

ఘనతర = గొప్పదైన, గోరాజగమన = వృషభముపైఁబోవువాఁడా! కాయజ దమనా = మన్మథుని దమించినవాఁడా! కనియెను, చూచెను, కాంచెను, కనుగొనెను, కన్గొనెను, అనంగను, వీక్షించెను = ఆలోకించెను, అనుటకు, పేళ్లై చనును. Saw.

క. చనుఁ గృతగమనుఁడ నయ్యెద
ననుటకు నామంబులగుచు ! నవని నరిగెదఁ
జనియెదఁ బోయెద నేఁగెద
పనివినియెద ననెడునట్టి ! పలుకులు (రుద్రా) 83

కృతగమనుఁడను = చేయఁబడిన నడకగలవాఁడను, అనుటకు, అరిగెదను, చనియెదను, పోయెదను, ఏగెదను, పనివినియెదను, అనెడు, పలుకులు, నామములు, అగును, Will go or Take leave.

ఆ. ద్విగుణమున కభిఖ్య ! లగు నిబ్బ డిమ్మడి
జంట దంట దుగయు ! జమిలి రెట్టి
యినుమడి యన మిథున ! మునకాఖ్యలగుఁజోడు
దోయి కవ యనంగఁ ! (ధూతకలుష) 84

ధూతకలుష = ఎగురుగొట్టఁబడిన పాపముగలవాఁడా. ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగయు, జమిలి, రెట్టి, ఇనుమడిఅనఁగా, ద్విగుణ

మునకు = రెట్టింపునకు, ఆఖ్యలు = నామములు. Two fold. జోడు, దోయి, కవ, అనగా, మిథునమునకున్ = జంటగా నుండుటకు, పేళ్ళు. Couple.

సీ. ఒండొక్కం డొకటి యొ ॥ క్కొండన నగు నేక
మీరు రెండిరు నాంగ ॥ నెసంగు ద్వయము
తిగ మూండు మూర్నాంగం ॥ దగు త్రయి, తీవంచ
నలు నాల్గు చౌ యన ॥ నగుం జతుష్క
మెసంగుం జౌవంచ యై ॥ దేననం బంచకం
బా; జిరుమూండిత్రి ॥ గనంగ నొప్పు
షట్కంబు; ఋషిసంఖ్య ॥ సత చక్కపగడ యే
డన నొప్పు; సప్తసం ॥ ఖ్యకును పేళ్ళు
తే. దనరు నిరునాలు గెనిమిది ॥ దచ్చి యనంగ
బరంగు నీరాఱు పండ్రెండు ॥ బార యనంగ
ద్వాదశమునకు నాఖ్యలు ॥ ధరణియందు
(వినుతకరుణాసనాథ శ్రీ ॥ విశ్వనాథ) 85

ఒండు, ఒకటి, ఒక్కండు, అనగా ఏకము = ఒకటిఅగును. One. ఈరు, రెండు, ఇరు, అనిన, ద్వయము = రెండు, ఎసగును Two. తిగ, మూండు, మూరు, నాగ = అనిన త్రయి = మూండు, తగును Three. తీవంచ, నలు, నాల్గు, చౌ అనంగ, చతుష్కము = నాలుగు, ఎసగును. Four, చౌవంచ, ఏను, ఐదు, అనగా పంచకము = అయిదు. Five. ఆఱు, ఇరుమూండు, ఇత్రిగ (ఇరు + తిగ), అనంగ, షట్కంబు = అఱు, ఒప్పును. Six. సత, (సప్త = ప్ర) చక్కపగడ, ఏడు, అనగా ఋషిసంఖ్య = ఏడు, ఒప్పును. Seven. ఇరునాలుగు, ఎనిమిగి, దచ్చి అనగ, ఎనిమిది. బరగును. ఈరాఱు = (రెండు ఆఱులు) బార (తురుష్కపదము బారా) అనంగ ద్వాదశము = పండ్రెండుకు, ఆఖ్యలు = పేళ్ళు. Twelve.

తే. జరిగె నూడెను జాఱెను ƒ నుఱికె వెళ్లెఁ
బాఱెఁ బఱచెను దొలఁగె న ƒ న్నలుకులెల్ల
నవనిలోనఁ బలాయితుం ƒ డయ్యె ననుట
కాఖ్యలై యొప్పుఁ (జంద్రరే ƒ ఖావతంస) 86

1. జరిగెను, 2 ఊడెను, 3 జాఱెను, ఉఱికెను, వెళ్లెను, పాఱెను, పఱచెను, 4 తొలగెను, అన్నలుకులెల్ల = ఈ మాట లన్నియు పలాయితుఁడు అయ్యెను=పఱుగిడెననుటకు ఆఖ్యలై = పేళ్లై, ఒప్పును. Ran. (కాని 1, 2, 3, 4, పదములకు కదలెనను సందర్భములందు ప్రయోగము గలదు. To move)

క. వేంచేసెను వచ్చెం జను
దెంచెను విచ్చేసె నరుగు ƒ దెంచె ననఁగ నే
తెంచె నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య ƒ (లంబరకేశా) 87

వేంచేసెను, వచ్చెను, చనుదెం[1]చెను, విచ్చేసెను, నరుగుదెం[1]చెను, ఏతెంచెను (ఏగు + తెంచు) అనగ, ఆగతుఁడు + అంచు=వచ్చినవాఁడు అని, పలుకుటకు ఆఖ్యలు = పేళ్ళు. Arrived.

తే. నాఁటిసుత నాఁటినుండియు ƒ నాఁటఁగోలె
నాఁటఁబట్టి నాఁడుమొదలు ƒ నాఁగ నాహ్వ
యమ్ము లయ్యెఁ దదారభ్య ƒ యనుట కవని
(వినుత కరుణాసనాథ శ్రీ ƒ విశ్వనాథ) 88

1. అరుగ్వాదులకుఁ దెంచు ధాతువగు. అగుచో నుకారంబుమీఁది దాని తకారంబునకు దకారంబగు. అరుగు + తెంచు = అరుదెంచు.

నాఁటినుత, నాఁటినండి, నాఁటఁగోలె, నాఁటఁబట్టి, నాఁడు మొదలు, నాగ=అనగా, తదారభ్య=అదిమొదలు, అనుటకు, ఆఖ్యలు. Since that day.

తే. వైరమునకును ధర సమాహ్వాయము లమరుఁ
గంటు పగ మచ్చరంబు నూడొంటమి యన
వలపు కూరిమి మేలు నా నలరుఁ బేళ్లు
మోహమునకును (శారదాంబుదనిభాంగ) 89

శారదాంబుద = శరత్కాలమేఘమువలె, నిభ=ప్రకాశించెడు, అంగ=దేహముగలవాఁడా; వైరమునకు=విరోధమునకు, కంటు, పగ, మచ్చరము-(మత్సరము-ప్ర) నూడు, ఒంటమి=సరిపడకపోవుట అనువనివి సమాహ్వాయములు = పేళ్ళు, తనరును. Enmity. మోహమునకుఁ = అపేక్షకును, (ప్రేమకు) వలపు, కూరిమి, మేలు, నా = అనిన పేళ్ళు అలరును. Love.

క. పెనకువ జగడము కయ్యం
బని బవరము కలను చివ్వ యాలము పోట్లా
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ బేళ్లు (చంద్రార్ధధరా.) 90

పెనకువ, జగడము, కయ్యము (కలహము-ప్ర) అని, బవరము, కలను, చివ్వ, ఆలము. పోట్లాట, దురము, పోరు, నాగాఁ = అనగా యుద్ధంబునకు, పేళ్ళు, తనరును. Battle or quarrel (వాచామూలకము పెనకువ, జగడము, పోట్లాట యనఁబడుచున్నది)

ఆ. సదమదంబు సేసె జక్కాడె నుగ్గాడెఁ
జదిపెఁ బీఁచమడఁచెఁ జంపెఁ గెడపె
నుఱుముసేసెఁ ద్రుంచెఁ బరిమార్చెఁ దెగటార్చె
మన్నిగొనియెఁ దునిమె మడిపె ననఁగ 91

తే. హతము గావించె ననుటకు ౫ నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె ౫ మంచెఁ బ్రోచె
సాకె నన నొప్పు నాఖ్యలు ౫ సరవితోడ
నరయఁ బోషించె ననుటకు ౫ (నంబికేశ) 92

సదమదముచేసెను, చక్కాడెను, నుగ్గాడెను, చదిపెను, పీఁచ మడచెను, చంపెను, కెడపెను, నుఱుముచేసెను, త్రుంచెను, పరిమార్చెను, తెగటార్చెను, మన్నిగొనియెను, తునిమెను (తునియుధాతువు) మడిపెను (మడియు ధాతువు) అనగ హతముగావించెను = చంపెను, అనుటకు, ఆఖ్యలు, అయ్యెను. Killed. మనిపెను, ఏలెను, బ్రతికించెను, మంచెను (మనుచు-మంచు) బ్రోఁచెను, సాకెను, అన, సరవితోడ = ఆపేక్షతో, పోషించెను = పెంచెను, అనుటకు, ఆఖ్యలు. Brought up.

క. ధరలో శూరాహ్వయములు
పరఁగుఁ మొనకాఁ డనంగా ౫ బంటనఁగాఁ బో
టరి యన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ ౫ (భీమకపర్ది) 93

భీమ = (పాపులకు) భయంకరమైనవాఁడా! కపర్ది = కపర్దమను జటాజూటము గలవాడా! మొనకాఁడు = ముందుండువాఁడు, బంటు (భటుడు-ప్ర) పోటరి = శౌర్యముగలవాఁడు, వడిగలవాఁడు = వేగముగల వాడు, బిరుదు, వాడిమగడు = వాడిగల మగవాఁడు, అన శూరాహ్వయ ములు = శూరునిపేళ్ళు. Brave man.

తే. బాసట యనంగఁ, దోడ్పాటు ౫ నాసమాహ్వ
యంబు లగుచుండు రెండు సా ౫ హాయ్యమునకు
నాఖ్యలు శుభంబునకును ల ౫ గ్గనఁగ బాగ
నంగ మేలన లెస్స య ౫ నంగ (నీశ) 94

బాసట, తోడ్పాటు, అనగా, సహాయ్యమునకు పేళ్ళు - Help.
లగ్గు, బాగు, మేలు, లెస్స అనగా శుభమునకు=మంచికి పేళ్ళు. good.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ గాలంబు సేసెను
గెడసె సమసె నాఱె మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె బిద్దె దోరెను గంతు
గొనియె ననుట పేళ్లగును మృతునకు 95

కూలెను, నీల్గెను, చచ్చెను, కాలంబుచేసెను, కెడసెను (కెడయు -ధాతువు) సమసెను, ఆఱెను, మడిసెను, చెల్లెను, పెద్ద నిదురపోయెను. బిద్దెను, దోరెను, గంతుగొనియెను, అనుట, మృతునకు = చనిపోయిన వానికి, పేళ్ళు అగును. Dead.

సీ. తిమ్మనైనది యనఁ దిన్ననైనది యన
జానైన దనఁగ బాగైన దనఁగ
నాణెమైన దన వినాణమైనది యన
మానైన దనఁగ లెస్సైన దనఁగ
చిన్ననైనది యనఁ జెన్నైన దన నలు
వైనది యనఁగ జెలువైన దనఁగ
బొనరినయది యన నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దన గ జక్కని దనంగ
సొబగైన దనఁగను సొంపైన దనఁ గొమ
రైనది యనఁ గొనరైన దనఁగ
సారమైన దన సింగారమైనదనమే
లైన దనంగ మెచ్చైన దనఁగ

తే. హతము గావించె ననుటకు నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె మంచెఁ బ్రోచె
సాకె నన నొప్పు నాఖ్యలు సరవితోడ
నరయఁ బోషించె ననుటకు (సంబికేశ) 92

సదమదము చేసెను, చక్కాడెను, నుగ్గాడెను, చదిపెను, పీఁచ మడచెను, చంపెను, కెడపెను, నుఱుము చేసెను, త్రుంచెను, పరిమార్చెను, తెగటార్చెను, మన్నిగొనియెను, తునిమెను (తునియుధాతువు) మడిపెను (మడియు ధాతువు) అనగ హతముగావించెను = చంపెను, అనుటకు, ఆఖ్యలు, అయ్యెను. Killed. మనిపెను, ఏలెను, బ్రతికించెను, మంచెను (మనుచు-మంచు) బ్రోఁచెను, సాకెను, అన, సరవితోడ = ఆపేక్షతో, పోషించెను = పెంచెను, అనుటకు, ఆఖ్యలు. Brought up.

క. ధరలో శూరాహ్వయములు
పరఁగుఁ మొనకాఁ డనంగా బంటనఁగాఁ బో
టరి యన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ (భీమకపర్ది) 93

భీమ = (పాపులకు) భయంకరమైనవాఁడా! కపర్ది = కపర్దము జటాజూటము గలవాడా! మొనకాఁడు = ముందుండువాఁడు,' బంటు (భటుడు-ప్ర) పోటరి = శౌర్యముగలవాఁడు, వడిగలవాఁడు = వేగముగల వాడు, బిరుదు, వాడిమగడు = వాడిగల మగవాఁడు, అన శూరాహ్వయములు = శూరుని పేళ్ళు. Brave man.

తే. బాసట యనంగఁ, దోడ్పాటు నాసహాహ్వ
యంబు లగుచుండు రెండు సాహాయ్యమునకు
నాఖ్యలు శుభంబునకును లగ్గనఁగ బాగ
నంగ మేలన లెస్స యనంగ (సీశ) 94

బాసట, తోడ్పాటు, అనగా, సహాయ్యమునకు పేళ్ళు - Help.
లగ్గు, బాగు, మేలు, లెస్స అనగా శుభమునకు=మంచికి పేళ్ళు. good.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ గాలంబు సేసెను
గెడసె సమసె నాఱె మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె బిద్దె దోరెను గంతు
గొనియె ననుట పేళ్లగును మృతునకు 95

కూలెను, ఈల్గెను, చచ్చెను, కాలంబుచేసెను, కెడసెను (కెడయు -ధాతువు) సమసెను, ఆఱెను, మడిసెను, చెల్లెను, పెద్ద నిదురపోయెను. బిద్దెను, దోరెను, గంతుగొనియెను, అనుట, మృతునకు = చనిపోయిన వానికి, పేళ్ళు అగును. Dead.

సీ. తిమ్మనైనది యనఁ దిన్ననైనది యన
జానైన దనఁగ బాగైన దనఁగ
నాణె మైన దన విన్నాణ మైనది యన
మానైన దనఁగ లెస్సైన దనఁగ
బిన్ననైనది యనఁ జెన్నైన దన నలు
వైనది యనఁగ జెలువైన దనఁగ
బొనరినయది యన నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దనఁగ జక్కని దనంగ
సొబగైన దనఁగను సొంపైన దనఁ గొమ
రైనది యన గొనబైన దనఁగ
దోరమైన దన సింగార మైనదన మే
లైన దనంగ మెచ్చైన దనఁగ

తే. మురువుగలయది యొప్పైన ౯ దొలవుగలది
యందమైనది తనరిన ౯ దలరినట్టి
దనఁగఁ బరఁగిన దనఁ బేళ్ళ ౯ తనరుచుండు
మంజులంబైన దనుటకు ౯ (మదనదమన) 96

తిమ్మనైనది, తిన్ననైనది, జానైనది, బాగైనది, నాణెమైనది, విన్నాణమైనది, మానైనది, (మాన్యమైనది) లెస్సైనది, పిన్ననైనది, చెన్నైనది = సొగసైనది, నలువైనది, చెల్వైనది, పొనరినది = ఒప్పిద మైనది, ఒనరినది, చొక్కటమైనది, చక్కనిది, సొబగైనది, సొంపైనది, కొమరైనది, గొనబైనది, తోరమైనది (స్థూలము-ప్ర — తోరము-వి) - సింగారమైనది - (శృంగారము-ప్ర) మేలైనది, మెచ్చైనది= మెచ్చుకోఁ దగినది, మురువుగలయది, ఒప్పైనది, ఒఱపుగలది, అందమైనది, తనరినది, తలరినట్టిది, పరగినది, అనగా, మంజులమైనది = మనోహరమైనది, అను టకు, పేళ్ళు. Beautiful or nice.

తే. కపుర మన గప్పురం బనఁ ౯ గప్ర మనఁగ
బుడమిఁ గర్పూర మొప్పుఁ దాం ౯ బూల మొప్పు
వీడియము వక్కలాకులు ౯ విడెము తమ్మ
లంబు వీడెంబు వీడ్య మ ౯ నం (బురారి) 55

కపురము, కప్పురము, కప్రము, అనగా కర్పూరము ఒప్పును. Camphor. వీడియము, వక్కలాకులు (వేసికొనుట) విడెము, తమ్మ లము, వీడ్యము, వీడెము, అనగా, తాంబూలము, ఒప్పును.

తే. వెలయు చుండును సిరి లచ్చి ౯ కలిమి యనెడు
పేళ్ళ సంపద; యెద్దడి ౯ పేదఱికము
లేమి నిప్పచ్చరము నవ్వొ ౯ లేమి డనఁగ
నలరు దారిద్ర్యమునకు నా ౯ ఖ్యలు (గిరీశ) 56

సిరి (శ్రీ-ప్ర) లచ్చి, కలిమి, అనెడు పేళ్లతో సంపద = ఐశ్వర్యము, వెలయుచుండును Wealth. ఎద్దడి, పేదరికము, లేమి = లేకపోవుట, నిష్పచ్చరము, నెవ్వ. లేమిడి, అనఁగ, దారిద్ర్యమునకు = బీదతికమునకు, ఆఖ్యలు. Poverty

తే. మగతనం బన గం డన మగఁటిమ యనఁ
బౌరుషంబున కాఖ్యలై పరఁగుచుండు
నుక్కు చేగ దిటము చేవ యుదుటు గట్టి
దిట్టముఱిది బిగువు నాఁగ ధృతికిఁ బేళ్ళు 99

మగతనము, గండు, మగటిమి, అనఁగా, పౌరుషంబునకు = పురుషుని తనమునకు, ఆఖ్యలు. Manliness. ఉక్కు, చేగ, దిటము, చేవ, ఉదుటు, గట్టి, దిట్టము, ఉఱిది, బిగువు, నాఁగ = అనఁగా, ధృతికి = ధైర్యమునకు, పేళ్ళు. Valour.

తే. బద్దు నా బొంకు నాఁగ దబ్బర యనంగఁ
గల్ల నాఁగ హుళిక్కి నా జెల్లుఁ బేళ్లు
ధర నసత్యమునకును; సత్యంబు పరఁగు
నిజ మనఁగ నిక్కువం బన నిక్కమనఁగ 100

బద్దు, బొంకు, దబ్బర, కల్ల, హుళిక్కి, నాఁ = అనినచో, అసత్యమునకు = అబద్ధమునకు, పేళ్ళు చెల్లును. Lie. నిజము, నిక్కువము, నిక్కము అనఁగ, సత్యంబు, చెల్లును. Truth.

క. బెడఁద దెస చేటు చేడ్పా
ట్లొడవాత్రం బంగలార్పు గోరంబు దొసం
గిడుమ వెత కస్తి యంగద
కడగండ్లన జను విపత్తు (గౌరీ రమణా) 101

---

1. చిహ్నాదులకుతిక వర్ణకంబగు.

జెడద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రము, అంగలార్పు
వెత (వ్యథ-ప్ర.) గోరము (ఘోరము-ప్ర.) దొసంగు, ఇడుమ, కస్తి,
అంగద, కడగండ్లు, అనగా, విపత్తు; ఆపద, తనరును. Mishap or
Misfortune.

క. వెల జట్టి విలువ రో యనఁ
గల నుడువులు దనరుచుండుఁ గ్రయనామములై
వెలయనంగ వంగసము నా
గొలమున వంగడము నాఁగఁగులమొప్పు (శివా) 102

వెల, జట్టి, విలువ, రో, అనగల = అనునట్టి, నుడువులు = పలుకులు, క్రయనామములై = వెలకుఁబేళ్లై, తనరును. Value. వంగసము, కొలము (కులము-ప్ర) వంగడము (వంశము-ప్ర) కులముపేళ్లు. (Sub) Sect.

క. క్రమ్మఱ నెప్పటి వెండియుఁ
గ్రమ్మఱి తిఱుగన్ మఱిన్ మరల మగుడను నా
నిమ్మహిఁ బునఃపదంబున
కిమ్ములనివి యాఖ్యలగు (మహీధరచాపా) 103

మహీధరచాపా! = మేరువు విల్లుగాఁగలవాఁడా! క్రమ్మఱ: ఎప్పటి, వెండియు, క్రమ్మఱి, తిరుగన్, మఱిన్, మరలన్, మగుడన్, నాన్ = అనిన పునఃపదంబునకు = మరల అనుపదమునకు, ఇవి ఆఖ్యలు. Again.

క. ఒకమరి యొకపరి యొకమాఁ
టొకసారొక తేప యనగ నొకపా రనఁగా
నొకవిడుత యొక్క తూకన
నొకతడవ యనంగ మఱియు నొకతూరియనన్ 104

తే. ఏకవారం బనుట కొప్పు నిన్ని పేళ్లు
జగతిఁ బల్మాఱు వేమాఱు సారె పెక్కు
మాఱు లెన్నేని మార్లనఁ బరఁగు నాఖ్య
లగుచు నివి బహువారంబు లనుట (కీశ) 105

ఒకమరి, ఒకపరి, ఒకమారు, ఒకసారి, ఒకతేప, ఒకపారి, ఒక విడుత, ఒక్కతూఁకు, ఒకతడవ, ఒకతూరి, అవగా, ఏకవారంబు = ఒక మారు, అనుటకు, పేళ్ళు. Once more. పల్మాఱు, (పలు + మాఱు) వేమాఱు (వేయి + మాఱు), సారె, పెక్కుమాఱులు, ఎన్నేనిమార్లు, అనగా బహువారంబులకు = పెక్కు సార్లకు, ఆఖ్యలు. Many a time.

తే. త్వరితమున కొప్పుఁ బేళ్లు చెచ్చెరను సరగ
వేగిరము వేగ వేళము వెసను వడిగ
గ్రక్కునను గ్రద్దన ననంగ గ్రన్న ననఁగ
గొబ్బునను దిగ్గున ననంగఁ (గుధరచాప) 106

చెచ్చెర (చెర + చెర) సరగ, వేగిరము, వేగ, వేళము, వెస, వడిగ, గ్రక్కున, గ్రద్దన, క్రన్నన, గొబ్బున, దిగ్గున, అనగ, త్వరితమునకు = తొందఱపడుటకు, పేళ్లు, ఒప్పును. Quick.

క. కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె ననుటకు ధరలో
వెలువడియె వెళ్ళె వెడలెను
వెలలె ననం (జిత్ప్రకాశ విశ్వాధిపతీ) 107

చిత్ప్రకాశ=జ్ఞానమే ప్రకాశముగాగలవాఁడా! విశ్వాధిపతీ= లోకమున కధిపతియైనవాఁడా! వెలువడియె, వెళ్లెను, వెడలెను, వెల లెను (లడలకు భేదములేదనుట నీరూపము) అనన్, నిర్గమించెను =

దాటిపోయెను, అనుటకు, ఆఖ్యలు = పేళ్ళు వరుసగా, కలవు=ఉన్నవి. Had gone.

క. వినుతియొనరించె ననుటకుఁ
దనరున్ నామంబులగుచు ॥ ధరపై నగ్గిం
చెను గైవారము సేసెన్
గొనియాడెను బొగడెననఁగ ॥ గొండాడెననన్ 108

అగ్గించెను, కైవారముచేసెను, కొనియాడెను, పొగడెను, కొండాడెను, అనగ, వినుతి యొనరించెను = పొగడెను, అనుటకు, నామంబులు కలవు. Praised.

సీ. చుట్టలు విందులు ॥ చుట్టాలు బంధుగు
లనఁ జను బంధుస ॥ మాహ్వయములు
వఱలు నన్యుఁడు లాతి ॥ వాఁ డనఁగా వింత
వాఁ డనఁగా బెఱ ॥ వాఁ డనంగ
వ్యాజంబునకు నామ ॥ మౌ నెపం బనఁగ; న
న్వేషించె ననుట కౌ ॥ వెదకె నెమకె
నరసె రోసె ననంగ ॥ నారసెఁ దడవె నాఁ
గాంక్షకుఁ బేరు లౌ ॥ గ్రమముతోడఁ
తే. గ్రచ్చు కోరిక తమి కోర్కి ॥ యిచ్చ యనఁగ
నెపుడు నెడపక యుఱుగక ॥ యెల్లపు డన
నిచ్చయనంబు నాఁగను ॥ నిచ్చ లనఁగఁ
దనరు నాఖ్యలు సంతతం ॥ బనుట (కీశ) 109

చుట్టలు, విందులు, చుట్టాలు; [1] బంధుగుల పేళ్ళు, చనున్ =

---

1. చుట్టము + లు = లులన. లు పరంబులగునపుడు మువర్ణమునకు లోపము తత్పూర్వ స్వరంబునకు దీర్ఘము విభాషనగును.

ఒప్పును. Relations. అన్యుఁడు = ఇతరుఁడు, లాతివాఁడు, వింతవాఁడు, పెఱవాఁడు, అనగా వఱలును, Other man. వ్యాజమునకు = మిషకు, నెపము, అనునవి నామము-Pretext. అన్వేషించెను = వెదకెను- అనుటకు, వెదకెను, నెమకెను, అరసెను, రోసెను, అరసెను, తడవెను. నా = అనగా, నామములు, అగును. Searched. క్రమ్మ. కోరిక, తమి, కోర్కి, ఇచ్ఛ—(ఇచ్ఛ—ప్ర) అనగ, కాంక్షకు = ఆపేక్షకు పేరులు. Wish. ఎపుడు, ఎల్లపుడు, ఎడపక, ఉడుగక, నిచ్చ(లు) అనయము, నాగ = అనినచో, సంతతంబు = ఎల్లపుడును, అనుటకు నామములు. Always.

సీ. తనరుఁ బ్రవేశించె । యనుటకు నాఖ్యలు
తూఁకొనెఁ జొచ్చెను । దూరె ననఁగ
సంఘ్రితాడితుఁ జేసె । యనుటకుఁ బేళ్ళగుఁ
దాఁచెఁ గాల్గ్రుమ్మెఁ । దన్నె ననఁగ
నాలస్య మొనరించె । ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను । మసలె ననఁగఁ
దృ క్తంబు గావించె । ననుటకుఁ నాఖ్యలో
పీడెను వదలెను । విడిచె ననఁగఁ

తే. దాఱుమాఱయ్యె పీడ్వడెఁ । దడఁబడె నన
నాఖ్య లొప్పు విపర్యస్త । మయ్యె ననుట
కలరుఁ బ్రహరించె ననుట కా । హ్వాయములడిచెఁ
గొట్టె మొత్తెను మోఁదె నాఁ । (గుధరనిలయ) 110

తూకొనెను, చొచ్చెను, దూరెను, అనగా, ప్రవేశితుఁడయ్యెను=లోనఁ జొచ్చెననుటకు, ఆఖ్యలు. Entered. తాచెను, కాల్గ్రుమ్మెను, తన్నెను, అనగను అంఘ్రితాడితుఁ జేసెననుటకు = కాలఁ గొట్టెననుటకుఁ బేళ్లు. Kicked. తడసెను (తడియుధాతువు) మసలెను.

అనగా, ఆలస్యము చేసెననుటకు ఆఖ్యలు. Delayed. వీడెను, వదలెను, విడిచెను, అనగ, త్యక్తంబుగావించెను = వదలిపెట్టెను, అనుటకు ఆఖ్యలు. Left. తాఱుమాఱైనది, వీడ్వడినది, తడబడినది, అనగ, విపర్యస్తమయ్యెను = తాఱుమాఱైనది, అనుటకు, పేళ్ళు. Confused. అడిచెను, కొట్టెను, మొత్తెను, మోదెను, అనగ, ప్రహరించెను = కొట్టెను, అనుటకు, ఆహ్వాయములు = పేళ్ళు. Beat.

సీ. ముందట నెదుటను ♦ మ్రోల ముంగల నాఁగ
నాఖ్యలౌ సముఖమం ♦ దనుట (కభవ)
యలయిక బడలిక ♦ యలపుఁ సేద యనంగ
శ్రమమున కాఖ్యలౌ ♦ (శమనదమన)
తాలిమి యోరుపు ♦ తాలిక నాఁగను
క్షమకు నాహ్వాయము లౌఁ ♦ (జర్మవసన)
రవళి బవంతంబు ♦ టక్కుదుత్తూరంబు
వెడ్డు నా ఛద్మ మౌ ♦ (విషమనేత్ర)
తే. వెఱ పనఁగ వెద యనఁగను ♦ వెఱ యనంగ
నళు కనఁగ భీతి కాఖ్యలౌ ♦ (నసితకంఠ)
నిమ్మళం బన నెమ్మి నా ♦ నెమ్మది యనఁ
దనరుఁ బేళ్ళు నిరాతంక ♦ మునకు (నీశ) 111

సముఖమందు=ఎట్ట ఎదుట, అనుటకు, ముందట, ఎదుట, ముంగల, మ్రోల, అనగా, పేళ్ళు, అగును. In front of, శ్రమమునకు = బడలికకు, అలయిక, బడలిక. అలపు, సేద, అనగ, ఆఖ్యలు, అగును, Tiresomeness. క్షమకును = సహనమునకు, తాలిమి, ఓర్పు, తాలిక, అనగా, పేళ్ళు అవును, (చర్మవసన = గజ చర్మము వస్త్రముగాఁగలవాఁడా!) రవళి, బవంతము, టక్కు, దుత్తూరము, వెడ్డు, అనగా

ఛద్మము=మోసము, అగును. Deceipt. వెఱపు, వెఱ, ఎద, అళుకు, అనగా, భీతికిఁ భయమునకు, ఆఖ్యలు. Fear. నిమ్మళము, నెమ్మ, నెమ్మది. (నెఱ+మది) అన,నిరాతంకమునకుఁ=భయములేని తనమునకు. పేళ్ళు. Fearlessness.

సీ. అసదు కొంచెముసైక । మలఁతి యన్నువ చిన్న
నలికంబు సన్నంబు । నాఁ దనర్చు
స్వల్ప మెక్కుడు నాఁగఁ । జాల నెంతేనియు
మిగులఁ దద్దయుఁ దద్ద । మిక్కిలి యనఁ
బెద్దయు నను నివి । పేళ్ళగు భృశముగా
ననుటకు నుత్కట । మయ్యె ననుట
కగు బేళ్ళు వెగ్గలం । బయ్యెఁ గ్రిక్కిఱిసె వె
క్కస మయ్యె నను నివి । క్రమముతోడ

ఆ. సగ్గెఁ గుందె డొంకెఁ దగ్గెను సడలెను
గ్రుంగె నుబ్బణంగె । గ్రుక్కెననఁగఁ
దనరుఁ బేళ్ళు క్షీణ । దశ నొందె ననుటకు
(సీశ్వరీ సనాథ । (విశ్వనాథ) 112

స్వల్పము=కొలది, అసదు, కొంచెము, సైకము, అలతి, అన్నువ, చిన్న, నలికము, సన్నము, అనగా ఒప్పును. Little. ఎక్కుడు, చాల, ఎంతేని, మిగుల, తద్దయు, తద్ద, మిక్కిలి, పెద్ద, అగునివి, భృశంబునకుఁ=ఎక్కువఁ దనమునకుఁ బేళ్ళు. Much. వెగ్గలమయ్యెను. క్రిక్కిఱిసెను, వెక్కసమయ్యెను, అనునివి, క్రమము లో ఉత్కటమయ్యెను=మితిమీఱెను, అనుటకుఁ బేళ్ళు. Unbearable. సగ్గెను, కుందెను, డొంకెను, తగ్గెను, సడలెను, క్రుంగెను, ఉబ్బణగెను, సుక్కెను, అనగ, క్షీణదశకు=తగ్గిపోవుటకు, పేళ్ళు. Lessened or loosened.

ఆ. మించు వాసి మేలు ౯ మేటి పెచ్చెచ్చన
నధికమునకు నాఖ్య ౯ లగుచు వెలయుఁ
బనులు నాఁగఁ జెయువు ౯ లనఁ జేత లన నొప్పుఁ
గర్మమునకుఁ బేళ్లు ౯ (చర్మవసన) 113

మించు, వాసి, మేటి, పెచ్చు, ఎచ్చు, అనగా అధికమునకు, పేళ్ళు. Greatness. పనులు, చెయువులు, చేతలు, అనగా, కర్మమునకు= -పనికి, నామములు ఒప్పును. Action,

ఆ. అనిపె ననిచెఁ బనిపె ౯ బనిచె నంపెను బంపెఁ,
బుచ్చె గెలువుమనియెఁ ౯ బొమ్మటనియె
ననఁగ నివి సమాఖ్య ౯ లగును ప్రస్థాపించె
ననెడు క్రియకు (నీశ ౯ యభ్రకేశ) 114

అనిపెను, అనిచెను, పనిచెను, పనిపెను, అంపెను, పంపెను, పుచ్చెను, గెలువుమనెను; పొమ్మనెను అనగా, ఇవి ప్రస్థాపించెను, కర్మకు=పంపెను అను పనికి. సమాఖ్యలు=పేళ్ళు. (ఇందు ప్రేరణము గ్రాహ్యము) Sent or caused to go.

తే. కొదవ కొద కుందు తగ్గు త ౯ క్కువ కొఱంత
వెలితి కొఱ లొచ్చు కడమనా ౯ వెలయు న్యూన
సమభిధానము లర సాము ౯ సగము సవము
నాఁగ నర్ధాహ్వయంబు లౌ ౯ (నాగభూష) 115

కొదవ, కొద, కుందు, తగ్గు, తక్కువ, కొఱఁత, వెలితి, కొఱ, లొచ్చు, కడమ, అనగా, న్యూన సమభిదానములు=లోటునకుఁ బేళ్ళు, వెలయును. Less or defect. అర, సాము, సగము, సవము, అనగా అర్ధాహ్వయములు = సగమునకుఁ బేళ్ళు, అగును. Half.

తే. పేళ్లు పశ్చాత్తనుటకును ॥ జెల్లు వెనుకఁ
బిదపఁ దర్వాతఁ బదపడి ॥ పిమ్మట నన
మునుపు మునుమున్ను తొలితొల్లి ॥ ముందు తొలుత
ననఁగఁ బూర్వపదార్థాఖ్య ॥ లౌ (గిరీశ) 116

వెనుక, పిదప, తర్వాత, పదపడి, పిమ్మట అనగా, పశ్చాత్తు=ఆ పిదప, అనుటకు, పేళ్లు. After. మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, ముందు, తొలుత, అనగా, పూర్వపదార్థాఖ్యలు = జరిగిపోయినది అను పదమునకు పేళ్లు. Before.

ఆ. పాఱుఁబోతు పిఱికి ॥ పంద కొంచ యనంగఁ
బేళ్లు దనరు సమర ॥ భీరువునకు
దిట్ట యుక్కుతునియ ॥ గట్టి డెందంబువాఁ
డనఁగ ధైర్యవంతుఁ ॥ డలరు (నీశ) 117

పిఱికి, పంద (పిఱికిపంద) కొంచ, అనగా సమర భీరువునకు= యుద్ధమున వెన్నిచ్చువానికిఁ బేళ్లు. A runaway or Coward. దిట్ట, ఉక్కుతునియ = ఉక్కుతుంట వంటివాఁడు. గట్టి డెందంబు వాఁడు=గుండె దిటవుగలవాఁడు. అనగా, ధైర్యవంతుఁడు = ధైర్యము గలవాఁడు అగును, Brave man.

తే. పౌఁజు చేరువ మొత్తంబు ॥ బారు తుటుము
దండు పరి గమి కూటువ ॥ పిండు దాఁటు
మూఁక దళమన బేళ్లు స ॥ మూహమునకు
(భుజగ వరహార యవిముక్త ॥ పురవిహార) 118

భుజగవరహార = శ్రేష్ఠమైన సర్పములు హారముగాఁ గలవాఁడా! అవిముక్తపుర=మోక్షము నిచ్చుపురమున, విహారా!=విహరించువాఁడా! పౌజు, చేరువ, మొత్తము, బారు, తుటుము, దండు, పరి, గమి, కూటువ,

పిండు, దాటు, మూక, దళము, సమూహమునకుఁ = గుంపునకు పేళ్లు,
Crowd or Army.

సీ. పూనె నూనెను దాల్చె ✱ నానెను మోచె నా
వహియించె ననుట కౌ ✱ (నహివిభూష)
నామము లుచ్చాట ✱ నము చేసెననుటకు
వరుసతోఁ దరిమెను ✱ బఱపె వెలిచెఁ
దోలెను ఱొప్పెనా ✱ (ద్రుహిణాదిసురనుత)
త్రిప్పెను నాఁగ్రమ్మ ✱ ఱించె ననఁగ
మగిడించె ననఁగను ✱ మఱలించె నన సమూ
హ్వాయములై పఱఁగు; ని ✱ వర్తితంబు
తే. చేసె ననుటకు సురముని ✱ (సిద్ధసేవ్య)
యడ్డగించెను నా నిల్పె ✱ ననఁగ నాఁగె
నన నివారించె ననుటకు ✱ నాఖ్యలమరు
(నగసుతానాథ గుహగజా ✱ నన సనాథ) 119

నగసుతానాథ = పార్వతీపతీ, గుహ = కుమారస్వామిని, గజానన=వినాయకుని, సనాథ=బలవంతులుగాఁ జేయువాఁడా? పూనెను, ఊనెను, తాల్చెను, ఆనెను, మోచెను, అనగా, వహించెను=తలదాల్చెను, అనుటకు పేళ్లు. Attempt or bear. తఱిమెను, బఱపెను, వెలిచెను, తోలెను, ఱొప్పెను, అనగా, ఉచ్చాటనముచేసెను = తఱిమివైచెను, అనుటకుఁ - పేళ్లు, Scattered. త్రిప్పెను, క్రమ్మఱించెను, మగిడించెను, మరలించెను, అనగా నివర్తితంబుచేసెను = పోవువాని నిలిపెను, అనుటకు, పేళ్లు. Gathered. అడ్డగించెను, నిల్పెను, ఆగెను, అనగా, నివారించెను = అడ్డుపెట్టెను, అనుటకు పేళ్లు. Obstructed.

తే. దండ చేరువ సంగడి ౹ దాపు చెంత
సరస చెంగట యొద్ద డ ౹ గ్గఱ కురంగ
టండ పజ్జయు నా సమీ ౹ పాఖ్య లమరు
(రమ్యధవళాంక కలశనీ ౹ రధినిషంగ) 120

రమ్యధవళాంక = మనోహరమైన తెల్లని గుర్తుగలవాడా! కలశనీరధి = పాలసముద్రము, నిషంగ=తూణీరముగాఁ గలవాఁడా, దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, దగ్గఱ, కురంగట, పజ్జ, అనఁగా సమీప+ఆఖ్యలు=దగ్గఱతనమునకు పేళ్లు, అమరును. Nearness.

తే. అచట నచ్చట నచ్చోట ౹ నంద నాడ
నచోట నచ్చోట నక్కడ ౹ నయ్యెడ నట
ననఁగఁ దత్ప్రదేశంబునం ౹ దనుట కాఖ్య
లయ్యె (భక్తవిధేయ యా ౹ ర్యాసహాయ) 121

భక్తవిధేయ=భక్తులకు విధేయుఁడైనవాఁడా! ఆర్యాసహాయ= పార్వతీదేవి సహాయముగాగలవాఁడా! అచట, అచ్చట, అచ్చోట, అందు, ఆడ, అచోట, అచ్చోట, అక్కడ, అయ్యెడ, అట, అనగా, తత్ప్రదేశంబునందు = ఆప్రదేశమున అనుటకు పేళ్లు. There.

క. ఇరుఁగెలఁకుల నిరువంకల
నిరుదెస నిరుచక్కియందు ౹ నిరుపక్కియలం
దిరుగ్రేవల నిరుగడ ననఁ
బొరిఁబేళ్ళగునుభయపార్శ్వ ౹ ములననుట(కజా) 122

అజా = పుట్టుకలేనివాఁడా! ఇరుగెలఁకుల, ఇరువంకల, ఇరుదెసల, ఇరుచక్కియలు, ఇరుపక్కియలు, ఇరుగ్రేవలు, ఇరుగడలు,

అనగా ఉభయపార్శ్వముల = రెండు ప్రక్కలందు, అనుటకుఁ పేళ్లు.
On both sides.

క. నవముగ ధరలో నీ మా
నవవర్గువు వేడ్కఁ జదివి వ్రాసిన మా
నవులకు ననవరతంబును
శివుఁ డవిముక్తేశ్వరుండు చెలువం బొసఁగున్ 123

తా॥ క్రొత్తగ భావించి యీ మానవవర్గును జదివిన, వ్రాసిన, మానవులకు మోక్ష సామ్రాజ్యాధిపతియైన శంకరుఁడు నిరంతర సంపదల నొసంగును.

## స్థావర వర్గు.

Words pertaining to Inanimates

సీ. వలిదిప్ప వడఁకుగు బ్బలి చలిమిరిమల
గట్టులతేఁడు ము క్కంటిమామ
మంచుఁగొండన హిమ తుహినాఖ్యలు చను
వేలుపుఁగొండ జే జేలగట్టు
పుత్తడి గుబ్బలి పునుకకంచమువాని
విల్లు నామేరువు పేళ్లువెలయు
వెలిదిప్ప ముక్కంటి మల వెండికొండ నాఁ
గైలాస పర్వతా ఖ్యలు సెలఁగు
తే. వెలయుఁ దరిగొండ కవ్వంపు మలయనంగ
మందరాఖ్యలు; కడపటి మల యనంగఁ

జుట్టుఁగొండనఁ దనరు నీఱ క్షోణియందుఁ
జక్రవాళాద్రి (వృషవాహ ఱ శైలగేహ) 124

వలిదిబ్బ = చలిగల కొండ, వడఁకుగుబ్బలి = వణఁకుఁ గలిగించు కొండ, చలిమిరిమల = చల్లఁదనముగల కొండ, గట్టులఱేఁడు = కొండలకు రాజు, ముక్కంటిమామ = (పార్వతినిచ్చుటచే) శివునకు మామయైన కొండ, మంచుకొండ = మంచుగల పర్వతము, అన, హిమక్ష్మాధర ఆఖ్యలు = హిమవత్పర్వతమునకుఁ బేళ్లు. The Himalayas. వేలుపుఁ గొండ = దేవతలుండు గిరి, జేజేలగట్టు—దేవతలదైన పర్వతము, పుత్తడి గుబ్బలి = బంగారుకొండ, పునుకకంచమువాని విల్లు = కపాలము ధరించిన శివునివిల్లు (త్రిపురసంహారమున మేరువు విల్లుగా ధరించెనని పౌరాణిక కథ) నాఁ = అనిన, మేరువు, పేళ్లు, వెలయు. The Meru. (ప్రథమ ప్రసక్తిహిమవంతమున కిచ్చుటిందు గ్రాహ్యము). వెలిదిప్ప = తెల్లనికొండ, ముక్కంటిమల = శివుని పర్వతము, వెండికొండ = వెండివంటి కాంతిగల గిరి, నాఁ = అనిన, కైలాసపర్వతాఖ్యలు = కైలాసము పేళ్లు. The Kailas. తరికొండ = చిలుకుట కుపయోగించిన కొండ, కవ్వపుకొండ. (దేవదానవులు దీనితో పాలసముద్రమును జిలికి వాంఛితములం బొందిరి) అనంగ, మందరాఖ్యలు = మందర పర్వతము పేళ్లు. The Mandara. కడపటిమల = ఆఖరుకొండ, చుట్టుకొండ = భూమికి చుట్టునుండెడి పర్వతము అని, చక్రవాళమునకు, పేళ్లు. అమరసింహుఁడు 'చక్రవాళంతుమండలం' అని కనుచూపుమేరగా దీనిని చెప్పెను. కాని పర్వతమనలేను. లోకము అలోకమునకు నడుమనుండునది కాన లోకాలోక పర్వతమని మనవారి తలంపు. The Lokaloka or the Chakravala.

ఆ. తూర్పుఁగొండ నాఁగఁ ఱ దొలుఁగట్టు నాఁగను
బొడుపుగుబ్బ లనఁగ ఱ బూర్వశిఖరి

పరఁగుఁ గ్రుంకుమెట్టు ౯ పడమటి కొండ నా
వెలయు నస్తశిఖరి ౯ (విశ్వనాథ) 125

తూర్పుఁగొండ=తూర్పు పర్వతము, తొలుగట్టు=మొదట చెప్పఁబడుకొండ, పొడుపుగుబ్బలి=సూర్యోదయమగు కొండ, అనగా, పూర్వశిఖరి = తూర్పునందలి పర్వతము. The Eastern Mountains. క్రుంకుమెట్టు = సూర్యుఁడస్తమించుకొండ, పడమటికొండ, నాఁగ = అనగా, అస్తశిఖరి=పడమటనుండు కొండ, వెలయును. The Western Mountains.

తే ఒప్పుగిరిపేళ్లు మలగట్టు ౯ తిప్పమెట్టు
కొండ గుబ్బలి నా మేరు ౯ (కుధరచాప)
ఱాయి నాఁ గల్లనంగను ౯ ఱా యనంగ
శిల కభిఖ్యలు దగు నిలఁ (శేషభూప) 126

మల, గట్టు, తిప్ప, మెట్టు, కొండ, గుబ్బలి, నా=అనిన, గిరిపేళ్లు=కొండకుపేళ్ళు. Mountain. ఱాయి, కల్లు, ఱా, యనగను శిలకభిఖ్యలు = ఱాతికి పేళ్ళు. Rock.

తే. పల్లె కొట్టిక కొటిక కు ౯ ప్పమ్ము నాఁగ
నూరనగ గ్రామనామంబు ౯ లొప్పుచుండుఁ
బట్టణంబున కాఖ్యలు పరఁగుచుండుఁ
బ్రోలనఁగ వీడనంగను ౯ (శూలపాణి) 127

పల్లె, కొట్టిక, కొటిక, కుప్పము, ఊరు, అనఁగా, గ్రామమునకుఁ బేళ్ళు. Village. ప్రోలు, వీడు, అనఁగను, పట్టణమునకు, అఖ్యలు = పేళ్ళు, పరఁగుచుండును. Town.

ఆ. ఉనికిపట్టు తావు ౯ మనికి పట్టిర విల్లు
తెంకి యిక్క నట్టు ౯ టెంకి యిమ్ము

నెలవు గీము నాఁగ ౯ నలరు నివాస దే
శంబునకును బేళ్ళు ౯ (చంద్రమౌళి) 128

ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, ఇల్లు, తెంకి, యిక్క, నట్టు, టెంకి, ఇమ్ము, నెలవు, గీము (గృహము-ప్ర) నాఁగ = అనఁగ, నివాస దేశమునకును=ఉండుచోటునకుఁ, బేళ్ళు,అగు. Abode.

సీ. తెంకాయ చెట్టనఁ ౯ టెంకాయ మ్రానన
నారికేళం బొప్పు ౯ (నగనివేశ)
మావిమ్రా ననఁగను ౯ మామిడిచెట్టన
నామ్రభూజం బొప్పు ౯ (నభ్రకేశ)
అత్తిమ్రానన మేడి ౯ యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు ౯ (మేరుచాప)
యరఁటియనఁటి నాఁగ ౯ నంశుమత్ఫలధారు
ణీరుహం బగు (ధర ౯ ణీశతాంగ)

తే. యలరుఁ దుంబీశలాటు స ౯ మాఖ్య లాను
గంబు సొఱకాయ పదరు నా ౯ (గరళకంఠ)
తా డనంగను దాడి నా ౯ తాళభూరు
హంబునకు నాఖ్యలై యొప్పు ౯ (నంబికేశ) 129

నారికేళము, తెంకాయమ్రాను, టెంకాయచెట్టు అనగా నొప్పును. The Coconut. ఆమ్రభూజము=మావిమ్రాను, మామిడిచెట్టు అనగా నొప్పును. The Mango. ఔదుంబర ధారుణీజము = మేడి చెట్టు, అత్తిమ్రాను, మేడి యనగా నొప్పును. The Fig tree. అంశు మత్ఫలధారుణీరుహము = కదలీ వృక్షము, అరటి, అనంటి, అనగా నొప్పును. The Plantain tree, తుంబీశలాటు = ఆనబచెట్టు, ఆను గము, సొఱకాయ, పదరు అనగా నొప్పుచుండును. తాళభూరుహము=

తాళవృక్షము. తాడు,తాడి యను నామములుగలవి. The Palm tree.

సీ. మొక్క మోక నిసువు ♦ మొలక మోసనఁగ నం
కురమునకును బేళ్లు ♦ (కుధరచాప)
ఇగురనఁ దలిరు నా ♦ జిగురు నాఁ జివురనఁ
బల్లవనామముల్ ♦ పరఁగు (నీశ)
మ్రానన జెట్టన ♦ మ్రాఁకన భూరుహ
నామధేయము లగు ♦ (వామదేవ)
పువు పువ్వు పూనాఁగఁ బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్యలై ♦ యలరు (నీశ)

తే. గుబురు దట్టము జొంపంబు ♦ గుంపు తఱచు
నాఁగ నిబిడంబు పేళ్లొప్పు ♦ (నందివాహ)
వల్లరిసమాఖ్య లగుచు వ ♦ ర్తిల్లుఁ దీఁగ
తీవ తీవియ తీవె నాఁ (త్రిపురవైరి) 130

మొక్క, మోక, నిసువు, మొలక, మోసు, అనగ, అంకురము నకు, పేళ్ళు-Sprout. ఇగురు, తలిరు, చిగురు, చివురు, అనగా, పల్లవ మునకుగా = లేయాకునకు, నామములు. Leaf buds. మ్రాను, చెట్టు, మ్రాకు, అనగా, భూరుహమునకు = వృక్షమునకు, నామములు - Tree. పువు, పువ్వు, పూ, పుష్పము (పుష్పము-ప్ర) విరి, అలరు, అనగా, కుసుమాఖ్యలు=పుష్ప నామములు-Flower. గుబురు, దట్టము, జొంపము, గుంపు, తఱచు, అనగా, నిబిడంబు=దట్టముగాఁ బెఱుగుటకుఁ బేళ్ళు, అగును. Bush, or immense growth. తీగ, తీవ, తీవియ, తీవె, అనగా వల్లరీసమాఖ్యలు = లతకు నామములు - Creeper.

ఆ. అగ్రమున కభిఖ్య లగుచుండుఁ దుద సుద
కొనయనంగ వృక్షకోటరమున
కలరుఁ బేళ్ళు తొఱట తొలి తొఱ్ఱ తొఱ నాఁగ
(నాగవిహార రజత నగవిహార) 131

తుద, సుద, కొన, అనునవి అగ్రమునకు = చివర భాగమునకు, నామములు-Top. తొఱట, తొఱ్ఱ, తొలి, తొఱ, అనఁగ, వృక్షకోటరమునకు = చెట్టులోని బొఱియకు, నామములు.

ఆ. ఇక్షువున కభిఖ్య లిక్షుతిఁ గన్నుల
మ్రాను చెఱకు తియ్య మ్రాననంగఁ
దనరు దవ యనంగఁ దలవాఁడె నాఁగఁద
దగ్రమున కభిఖ్య లగు (గిరీశ) 132

కన్నులమ్రాను=కణుపులు గలది, చెఱకు, తియ్యమ్రాను= తీయఁదనము గలది, అనఁగా, ఇక్షువునకు = చెఱకుగడకు, అభిఖ్యలు=పేళ్ళు. (మ్రానన్నట ప్రయోగవిశేషము) Sugarcane, తదగ్రమునకు = ఆ చెఱకుగడ కొనకు, దవ, తలవాడె, అనిపేళ్ళు. (Tip of the cane)

క. అగుఁ బేళ్లుత్పలమునకుం
దొగ తొవ కల్వ కలు వనఁగఁ దోయజ మొప్పం
దగఁదమ్మి తామ రనఁగా
మొగడన మొగ్గయనఁదనరుముకుళంబు (శివా) 133

తొగ, తొవ, కల్వ, కలువ, అనునవి, ఉత్పలమునకుఁ = తెల్ల కలువకుఁ పేళ్ళు- White lily. తమ్మి, తామర, అనఁగా, తోయజము = కమలము, ఒప్పును, Lotus. మొగడ, మొగ్గ, అనఁగా, ముకుళంబు= మొగ్గకు పేళ్ళు - Bud.

తే. ఎసఁగుఁ జెందొవ చెందొగ ♦ యెఱ్ఱఁగలువ
యనఁగ రక్తోత్పలంబు ర ♦ క్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి కెందామ ♦ రెఱ్ఱదామ
రనఁగ జెందమ్మి చెందామ ♦ రన (మహేశ) 134

చెందొవ (చెన్ను + తొ[1]వ) అందమైన కలువ, చెందొగ (చెన్ను + తొగ) ఎఱ్ఱకలువ అనగ, రక్త + ఉత్పలము = ఎఱ్ఱని కలువ, ఒప్పును - Red lily. కెందమ్మి (కెంపు + తమ్మి[1]) కెందామర (కెంపు + తామర) ఎఱ్ఱతామర, చెందమ్మి (చెన్ను + తమ్మి) = చెందామర అనగా, ఎఱ్ఱని కమలమగును - Red lotus.

క. గొడుగు గొడు వెల్లి యనఁ జె
న్నడరను ఛత్రంబు కేత ♦ నాహ్వయము లగుఁ
సిడె మనఁగ డెక్కె మనఁగాఁ
బడగ యనఁ డా లనంగఁ ♦ (బర్వతధన్వి) 135

గొడుగు, గొడువు, ఎల్లి, అనగా, ఛత్రంబు చెన్నడరును = సొంపారును; Umbrella. సిడెము, డెక్కెము, పడగ, డాలు, అనగా, కేతనాహ్వయములు = జండాకుఁ బేళ్ళు - Flag.

క. మఱుఁగనఁగ నోల మనఁగాఁ
మఱు వనఁగా జాటనంగ ♦ మాటన వరుసం
బరఁగు నివెల్ల నగోచర
ధరణీ నామంబు లగును ♦ (దర్పకదమనా) 136

దర్పకదమనా = మన్మథుని హరించినవాఁడా! మఱుగు, ఓలము, మఱువు, చాటు, మాటు, అనగా, ఇవన్నియు, అగోచర ధరణీ నామంబులు = కనుపడని చోట్లకుఁ బేళ్ళు - Hidden spot.

---

1. ప్రాతాదుల లుప్తశేషమునకు ప్రుతకార్యము.

క. పొసగుఁ దృణాఖ్యలు పులు నాఁ
గస వనఁగా బూరి యనఁగ గ్రీ గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
ససి సస్సెము పైరనంగ గ్రీ సస్యం (బభవా) 136

పులు, కసవు, పూరి, గడ్డి, అనగా, వసుమతిలో=ధరణియందు, తృణాఖ్యలు=గడ్డికిపేళ్ళు - Grass. సస్యంబు = పైరు, ససి, సస్సెము (సస్యము-ప్ర) పైరు, అని, ఎన్నఁబడును. Crop.

ఆ. తెలుపు దెల్ల వెల్ల గ్రీ తెలి వెలి నాఁగ నా
హ్వాయము లమరు ధవళ గ్రీ వర్ణమునకుఁ
గప్పు నలుపు నల్ల కఱ గ్రీ యన నాఖ్యలౌ
నీలవర్ణమునకు గ్రీ (నీలకంఠ) 137

తెలుపు, తెల్ల, వెల్ల, తెలి, వెలి, నాఁగ=అనఁగా, దవళము నకుఁ=తెలుపునకు, ఆహ్వాయములు = నామములు. White. కప్పు, నలుపు, నల్ల, కఱ, అనగా, నీలవర్ణమునకు=నలుపునకు, ఆఖ్యలు=పేళ్ళు, అగును. Black.

ఆ. కెంపు దొగరు దొవరు గ్రీ గెంజాయ యెఱు పెఱ్ఱ
యనఁగ నరుణకాంతి గ్రీ కాఖ్య లయ్యె
నళిది పసుపుచాయ గ్రీ యనఁగ హారిద్రవ
ర్ణమున కాఖ్య లగుఁ (బి గ్రీ నాకహస్త) 138

పినాకహస్త=పినాకము (విల్లు) చేత ధరించినవాఁడా, కెంపు, తొగరు, తొవరు, కెంజాయ (కెంపు + చాయ) ఎఱుపు, ఎఱ్ఱ, అనగా, అరుణకాంతి=ఎఱ్ఱనిరంగు, పేళ్ళు. Red. అళిది, (అరిదళవర్ణము) పసుపు చాయ (ఛాయకు వికృతి చాయ) అనఁగ హారిద్రవర్ణమునకు=పసుపుపచ్చ రంగునకు, పేళ్ళు. Yellow.

ఆ. శ్యామవర్ణమునకు నామంబు లగుచుండుఁ
బసరుఛాయ యనఁగఁ బచ్చ యనఁగ
వన్నె డాలు రంగు వన్నియు జిగి జోతి
చాయ యనఁగఁ బరఁగు జగతిఁ గాంతి 139

పసరుఛాయ, పచ్చ అనగా, శ్యామవర్ణమునకు=ఆకుపచ్చ రంగునకు నామములు. Green. (ఇవి ప్రధానములు. మిగిలినవి వీనిలో నొకటితో నొకటి కలుపుటవలన వచ్చును) వన్నె (వర్ణము – ప్ర.) డాలు, రంగు, వన్నియ, జిగి, జోతి, చాయ అనగా, కాంతి పరగును. సాధారణముగా, వర్ణమునకుఁ బర్యాయములు. Colour.

తే. మానికము లన రతనముల్ నా నెసంగు
నవని మాణిక్యములకు స మాహ్వయములు
మెఱుఁ గనంగను నిగ్గు నా మెఱయుచుండు
నాఖ్య లుత్కృష్ట కాంతికి (నభ్రకేశ) 140

మానికములు (మాణిక్యము – ప్ర.) రతనములు (రత్నము – ప్ర) అనునవి మాణిక్యములకుఁ బేళ్ళు Rubies. ఉత్కృష్టకాంతికిన్=శ్రేష్ఠమైన కాంతికి, మెఱుగు, నిగ్గు, అనునవి పేళ్ళు. Glamour.

తే. జడధిపేళ్ళగు మున్నీరు కడలి సంద్ర
మనఁగ మడుఁ గన మడువు నా హ్రదము దనరుఁ
బరఁగు నాఁబవసంద్రంబు పాలవెల్లి
జిడ్డుకడలి పాల్కడలి నా క్షీరజలధి 141

మున్నీరు (ముందు + నీరు)=భూభాగము సృష్టిగాకముందు నీరుండినదని ప్రసిద్ధి - కడలి, సంద్రము (సముద్రము - ప్ర) అనగా, జడధి=సముద్రమునకుఁ బేళ్ళు. Sea or Ocean. మడువు, అనునది, హ్రదము

నకు = తనంత నేర్పడిన నీటిగుంతకు పేరు. Pond. ఆఱవ సంద్రము, (సముద్రములు ఏడు, లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, జల సముద్రములు), పాలవెల్లి = పాల సముద్రము, జిడ్డుకడలి = జిడ్డుగల యుదధి, నా=అనిన, క్షీర సముద్రమగును, Milk Ocean.

క. నంజె యన మడి యనంగను
మంజుల కేదారభూస ♦ మాఖ్యలు వెలయుం
బుంజె యనఁ జేను పొల మనఁ
గంజిన మరుభూమి పేళ్లు ♦ (కాయజదమనా) 142

మంజుల = మనోహరమైన, కేదార భూసమాఖ్యలు=వరి పొలముల పేళ్ళు, నంజ, మడి, అనునవి Rice field (wet land.) పుంజె, చేను, పొలము, కంజ, అనగా, మరుభూమి = నీటి వసతిలేని భూమి పేళ్ళు. Dry land.

క. ధరణికి వివరాఖ్య లగుఁ
బొఱియ కలుఁగు లాఁగ బొక్క ♦ బొంద యనంగా
దరి యొడ్డు గట్టనంగాఁ
బరఁగుం దీరంబు పేళ్లు ♦ (ప్రమథగణేశా) 143

ప్రమథ గణేశా=ప్రమథుల గుంపునకు నాయకుడా! బొఱియ, కలుగు, లాగ, బొక్క, బొంద, అనగా, వివర + ఆఖ్యలు= బొక్కకుఁ బేళ్ళు Hole. తీరంబు పేళ్ళు = నదీతీరనామములు దరి, ఒడ్డు, గట్టు అనునవి. Bank.

తే. అస లనంగను ఱొంపి నా ♦ నడుసనంగ
బుఱద నా నొప్పుఁ గర్దమం ♦ బునకుఁ బేళ్లు

భూమికి సమాఖ్యలగు బువి ఽ పుడమి నేల
మన్ను పంటవలంతి నా ఽ (మదనదమన) 144

అసలు, ఊంపి, అడుసు, జుఱద, అనంగను, కర్దమంబునకున్ = అడుసునకు, పేళ్ళు, ఒప్పును. (Marsh). బువి (భువి—ప్రకృ) పుడమి (పృథివి—ప్ర) నేల, మన్ను, పంటలవలంతి = పంటల నొసంగునది, అనగా భూమికి పేళ్ళు. Earth.

తే. జగిలె యనఁగ నఁరుగు నాఁగఁ జగతినాఁగఁ
దిన్నె యన వేదికాఖ్యలై ఽ యెన్నఁదనరు
మిఱ్ఱనంగను మెరక నా ఽ మిట్టయనఁగ
నున్నత క్షితికాఖ్యలై ఽ యొప్పు (నభవ) 145

జగిలె, అరుగు, జగతి, తిన్నె, అనగా, వేదికాఖ్యలై = అరుగునకుఁ బేళ్లై, ఒప్పును, Pial. మిఱ్ఱు, మెరక, మిట్ట, అనగా, ఉన్నత క్షితికిన్ = ఎత్తైన నేలకు, ఆఖ్యలు = పేళ్ళు. Elevated Ground.

తే. తనరు నిశ్రేణి తాప ని ఽ చ్చెన యనంగఁ
దెప్పతేప పనునాఖ్యల ఽ నొప్పుఁబ్లవము
పరఁగు నోడనఁ గల మనఁ ఽ దరణి ధరణిఁ
దరణిశీతాంశుశిఖినేత్ర ఽ (ధవళగాత్ర) 146

తరణి, శీతాంశు, శిఖి, నేత్ర = సూర్యుఁడు, చంద్రుఁడు, అగ్ని కన్నులుగాఁగలవాఁడా! ధవళగాత్ర = తెల్లని దేహముగలవాఁడా! తాప, నిచ్చెన, అనగ, నిశ్రేణి = నిచ్చెనకు—పేళ్ళు. Ladder. ప్లవమునకున్ = తెప్పకు, తెప్ప, తేప, అని పేళ్ళు. Boat. ఓడ, కలము, అనునవి నావకుఁ బేళ్లు, Ship.

తే. కార్ముకం బొప్పు విల్లు సింగాణి యనఁగఁ
దూణ మొప్పు బత్తళిక నా దొన యనంగఁ
దరకసం బనఁ బొది యనఁ దనరు శరము
కోల ములి కమ్ము తూఁపు నా (శూలపాణి) 147

విల్లు, సింగాణి (శింజిని—ప్ర) అనగా, కార్ముకము=ధనువు, ఒప్పును. Bow. బత్తళిక, దొన. పొది, అన తూణము = అంబుల పొది, ఒప్పును Quiver. కోల, ములికి, అమ్ము తూపు, అనగా శరము=బాణము, తనరును, Arrow.

తే. తనరు బేళ్లు తనుత్రాణ మునకుఁ గత్త
ళంబు జోడు జిరా దుప్పటంబు బొంద
ళం బనఁగ నాఖ్యలగు శతాంగంబునకును
దేరు నా నరదము నాఁగ (మేరుచాప) 148

కత్తళము, జోడు, జిరా, దుప్పటము, బొందళము అనగా తనుత్రాణము=కవచము, ఒప్పును. Armour. తేరు, అరదము (రథము - ప్రకృ) అనగా, శతాంగమునకు = పెక్కుభాగములుగల రథమునకు పేళ్లు. Chariot.

క. కన్నా కన్నను దలక
ట్టన్నను మఱి మేలుబంతి యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠము పేళ్లై
యెన్నంబడు రాజసభల (నిభదైత్యహరా) 149

ఇభదైత్య హరా = గజాసురునిఁ జంపినవాఁడా! రాజసభలన్ = రాజుల సభలందు, కన్నాకు, తలకట్టు, మేలుబంతి, అను ఈపదములు, శ్రేష్ఠము పేళ్లై = ఉత్తమత్వమునకు నామములై ఒప్పును. Foremost or Best.

క. సొమ్మనఁదొడ వనఁగా రవ
ణమ్మన నగుఁ బేళ్లు భూష ♦ ణమ్ములకును హా
రమ్ములకు నగును నభిధా
నమ్ములు పేరులన సరులు ♦ నా (శితికంఠా) 150

సొమ్ము, తొడవు, రవణము (ప్రోగునది) అనునివి, భూషణముల కున్ = ఆభరణములకు నామములు, Ornaments. పేరులు, సరులు అనునవి, హారమునకు నభిధానంబులు = కంఠహారముల పేళ్ళు. Necklaces.

తే. సరము లెత్తులు దండలు సరులనంగ
నామధేయంబు లగుఁ బుష్ప ♦ దామములకు
వాసనకు నాఖ్యలై యొప్పు ♦ వలపు కంపు
తావి కమ్మన యనఁగఁ (గా ♦ త్యాయనీశ) 151

కాత్యాయనీ + ఈశ = పార్వతికిఁ బతియైనవాఁడా, సరులు, ఎత్తులు, దండలు, అనగా, పుష్పదామములకున్=పూలదండలకు, నామములు. Garlands. వలపు, కంపు, తావి, కమ్మన, అనఁగా వాసనకు= గంధమునకు, నామములు, Smell.

క. ఒడమె యన సొమ్మనంగా
విడిముడి యన రొక్కమనఁగ ♦ విత్తంబునకుం
బుడమిని నామములగు నివి
(యుడురాజకళావతంస ♦ యురగాభరణా) 152

ఉడురాజ కళావతంస = చంద్రునియొక్క కళ, శిరసు పూవుగా గలవాఁడా, ఉరగాభరణా=పాములు సొమ్ములుగాఁగలవాఁడా! ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కము (రుక్మము—ప్ర) అనునవి, విత్తమునకున్ = ధనమునకు, పేళ్ళు. Money.

తే. మచ్చు లన మిద్దెలనగను మాడుగు లన
దారునిర్మిత గేహముల్ దనరుచుండుఁ
బరఁగు సౌధంబు మేడ యు ప్పరిగ యనఁగ
(నాగకేయూర మౌనిమా నసవిహార) 153

నాగకేయూర = పాములు భుజభూషణములుగాఁ గలవాఁడా! మౌని మానసవిహార=మునుల మనసులందు విహరించువాఁడా! మచ్చులు, మిద్దె, మాడుగులు, అనగా, దారు నిర్మిత గేహముల్ =కట్టె నుపయోగించి కట్టినయిండ్లు (పూర్వము శిలాగృహములు, దారు నిర్మితగృహము లని రెండు విధములనుండినవి కాఁబోలును.) ఒప్పును. Upstair-buildings. సౌధముల్ = తెల్లనైన రాచనగరులు, మేడలు, ఉప్పరిగెలు, అనగా ఒప్పును, Royal palace.

తే. పెట్టి యన మందసం బనఁ బెట్టె యనఁగఁ
బెట్టియ యనంగఁ బేటికా భిఖ్య లమరు
మ్రోఁ డనంగను మోటు నా మొద్దనంగ
వెలయు స్థాణుసమాఖ్యలు (విశ్వనాథ) 154

పెట్టి (పేటిక-(ప్ర) మందసము, పెట్టె, పెట్టియ, అనంగను, పేటికాభిఖ్యలు=పెట్టెకు నామములు.Box. మ్రోడు, మొద్దు, మోటు, స్థాణుసమాఖ్యలు = కదలనిదానిపేళ్ళు. Immovable.

ఆ. విస్తృతాఖ్య లొప్పు విప్పు తనర్పు నా
వెడఁద విరివి పఱపు వెడలుపనఁగ
దీర్ఘమునకు నామ ధేయంబులై యొప్పు
నిడుద చాఁపు నిడివి నిడు పనంగ 155

విప్పు, తనర్పు [తనరుచు-ధాతువు) వెడద, విరివి, పఱపు, వెడలుపు, నా = అనగా, విస్తృతాఖ్యలు=విరళతకుఁ బేర్లు - Breadth.

నిడుద, చాపు, నిడివి, నిడుపు, అనంగ, దీర్ఘమునకు నామధేయంబులు=పొడవునకుఁ బేళ్లు – Length.

ఆ. ఈడు దినుసు సాటి యెన దొర సరి జోడు
సవతు మాద్రి యుద్ది జత తరంబు
పురుడు నాఁగ సదృశ మున కివి యాఖ్యలౌ
(వివిధగుణసనాథ విశ్వనాథ) 156

వివిధగుణసనాథ=నానావిధ వర్తనములకు స్థానమైనవాఁడా! విశ్వనాథ! ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాద్రి (మాదిరి) ఉద్ది, జత, తరము, పురుడు, నాఁగ=అనగా, సదృశమునకు=సాటితనమునకు ఇవి, ఆఖ్యలు=పేళ్లు–Equal.

తే. పసిఁడి బంగరు బంగారు పైడి పొన్న
జాళువా పుత్తడి యనంగ స్వర్ణ మమరుఁ
దప్తకాంచన మమరుఁ గుం దన మనంగ
డాని యపరంజి నా (గజ దానవారి) 157

పసిడి, బంగరు, బంగారు, పైడి, పొన్న, జాళువా, పుత్తడి, అనంగ, స్వర్ణము=హేమము, అమరును – Gold. కుందనము, కడాని, అపరంజి, నాఁగ =అనిన, తప్తకాంచనము = కఱిగించిన బంగారు – Pure (melted) Gold.

ఆ. చిదుర తునుక తునియ చిదురుప వ్రక్క పా
లనఁగ ఖండమునకు నాఖ్యలమరుఁ
బ్రోగు కుప్ప వామి ప్రోవు తిట్టయనంగ
రాశి కాఖ్య లగు (ధ రాశతాంగ) 158

ధరాశతాంగ=భూమియే రథముగాఁ గలవాఁడా! చిదురు,

తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పాలు, అనగా, ఖండమునకును= ఒక భాగమునకు, ఆఖ్యలు=పేళ్లు-Part or bit. ప్రోగు, కుప్ప, వామి, ప్రోవు, తిట్ట-రాశికిని=గుమికి, ఆఖ్యలు=పేళ్లు-Whole, (heap).

క. ఈ స్థావరవర్గం గడు
నాస్తిని వినఁ జదువ వ్రాయ ♂ నవనీస్థలిలో
నాస్థాణునికృప నఖిలశు
భస్థితులును జనుల కొదవు ♂ భాసురలీలన్ 159

ఈ స్థావరవర్గమును, మిక్కిలి యాసక్తితో చదివినను, వినినను, వ్రాసినను, ఆ శంకరుని దయవలన సకలమైన శుభములు గలుగును.

---

## తిర్యగ్వర్గు - జంతుకోటి నామములు

Words pertaining to Animals.

సీ. వెడదమోము మెకంబు ♂ జడలమెకం బేనుఁ
గులగొంగ మెకముల ♂ కొలము సామి
తెల్లడాలు మెకంబు ♂ తెఱనోటిమెకము సిం
గంబు నా బొబ్బ మె ♂ కం బనంగఁ
బరఁగును మృగరాజు ♂ పసిడిండి పులిమెకం
బుల తిండిపోతు చా ♂ అల మెకంబు
ముష్కన్న మెక మన ♂ నివ్వసుంధరయందు
వ్యాఘ్రంబునకు సమా ♂ ఖ్యలు చెలంగుఁ
ఆ. బుట్టకూడు దిండి ♂ పో తన వెనుకచూ
పుల మెకంబు నాఁగ ♂ నెలు వనంగ

నెలుఁగు నాగఁ మోర ౯ తెలుపుమెకంబు నా
భల్లుకంబు దనరు ౯ (ఫాలనేత్ర) 160

వెడదమో[1]ము మె[2]కంబు=వెడలైన ముఖముగల మృగము, జడ[3]ల మెకము=జడలుగల మృగము, ఏనుగులగొంగ=ఏనుగులకు విరోధి యైన జంతువు, మెకములకొ[4]లముసా[5]మి=మృగసమూహమునకు రాజు (మృగరాజు), తెల్లడాలు మెకము=తెల్లనికాంతిగల మృగము, తెఱనోటి మెకము=తెఱచియుండు వదనముగల జంతువు, సిం[6]గంబు=సింహము, బొబ్బమెకము=గర్జించు జంతువు, అనంగ, మృగరాజు=హర్యక్షము, పరగను=ఒప్పును-Lion. పసిడిండి=మాంసమును దినునది, పులి, మెకంబుల తిండిపోతు=జింకలను దినమరగినది, చాఱలమెకము=దేహముపైఁ జారలుగలది, మువ్వన్నె మెకము (మూడు + వ[7]న్నె)=తెలుపు, నలుపు, పసుపు వర్ణములుగలది; అనునివి, వ్యాఘ్రంబునకు సమాఖ్యలు=పెద్దపులికిఁ బేళ్లు-Tiger. పుట్టకూడు తిండిపోతు=పుట్టకూడు తినునది, వెనుకచూపుల మెకము=వెనుకదృష్టిగలది. ఎలువు, ఎలుగు, మోర తెలుపు మెకము=తెల్లగానుండు నోరుగల మృగము, అనునివి భల్లూకమునకు బేళ్లు-Bear.

క. పలుగొమ్ములమెక మనఁగా
నిల నెక్కుడుమెక మనంగ ౯ నేనుఁ గనంగాఁ
బలువంజమెకము నాఁ జే
గలమెక మన గొరనంగఁ ౯ గరియొప్పు(శివా) 161

పలుగొమ్ములమెకము = పండ్లే (కోరలే) కొమ్ములుగాగల జంతువు; ఎక్కుడుమెకము=ఎక్కుటకుపయోగించు మృగము, ఏనుఁగు, బలువంజమెకము (బలువు + అంజ + మెకము) బలమైన పాదములుగల

---

ప్రకృతిరూపములు:—1. ముఖము, 2. మృగము, 3. జట, 4. కులము, 5. స్వామి, 6. సింహము, 7. వర్ణము.

జంతువు, చేఁగలమెకము (చేయి + కల = చేఁగల) హస్తము (తొండముగాఁగల మృగము) గారు, అనునివి గజమునకు నామములు. Elephant.

తే. వాజికి సమాఖ్యలగుఁ దేజి ‌‌‌‌‌‌‌‌‌॥ వారువంబు
మావు గుఱ్ఱంబు ॥ తట్టువ ॥ వావురంబు
కత్తలాని బాబా జక్కి ॥ తత్తడి యన
(విగత భవపాశ కాశీని ॥ వేశ యీశ) 162

తేజి, వారువము, మావు, గుఱ్ఱము, తట్టువ, వావురము (వారువము) కత్తలాని, బాబా, జక్కి, తత్తడి, అనునివి, వాజికి=గుఱ్ఱమునకు నామములు-Horse.

క. తగ రేడిక పొట్టే లన
నగు మేషసమాఖ్య లెనిమి ॥ దడుగుల మెకమే
నుఁగుగొంగసూఁ డనంగా
జగతిఁ శరభాఖ్య లొప్పుఁ ॥ (జంద్రార్ధధరా) 163

తగరు, ఏడిక, పొట్టేలు, అనునవి మేషసమాఖ్యలు=గొఱ్ఱెపోఁతు పేళ్లు-Sheep. ఎనిమిదడుగుల మెకము = ఎనిమిది పాదములుఁగల మృగము, ఏనుఁగుగొంగసూడు=సింహమునకు శత్రువు. అనగా, శరభాఖ్యలు=శరభము పేళ్లు. ఒప్పును. ఇది శివుఁడు శరభావతార మెత్తినను సందర్భమున సృష్టింపఁబడినదిగాని నిజముగా నిట్టి మృగముండినదనుట విశ్వసింపరానిమాట.

క. సంగతి నుష్ట్రాఖ్యలు నొ
ప్పెం గడు నొంటె లన లొట్టి ॥ పిట్టలనఁ సా
రంగాఖ్య లలరు నిఱ్ఱు ల
నంగా జింక లన లేళ్లు ॥ నా (సర్వజ్ఞా) 164

ఒంటె, లొట్టిపిట్ట అనునివి, ఉష్ట్రమునకుఁ బేళ్లు-Camel.
ఇఱ్ఱి, జింక, లేడి అనునవి, సారంగాఖ్యలు=జింకకుఁ బేళ్లు-Deer.

క. నులిగొమ్ముల మెక మిఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ బేళ్లు మృగి ॥ లేడి యనన్
వెలయును రెంటికిఁ దగు నా
ఖ్యలు జింక యనంగ నీశ ॥ (యంబరకేశా) 165.

పైనామము స్త్రీ పుంస్త్వముల కన్వయించుట నిందుఁ బ్రత్యే కింపఁ బడినవి. నులిగొమ్ముల మెకము=మెలికలు దిరిగిన కొమ్ములుగల మృగము. ఇఱ్ఱి అనగా, దుప్పికిఁ బేళ్ళు-Stag. లేడి, అనునది యాఁడు జింకకుఁ బేరు. జింకయన రెంటికి నన్వయించును.

తే. పసులు తొడుకులు పసరముల్ ॥ పసి యనంగఁ
బశువులకును సమాఖ్యలై ॥ పరఁగు నాల
పోఁతు బసవఁడు గిబ్బ యాఁ ॥ బోఁతనంగ
వృషభమున కాఖ్యలై యొప్పు ॥ (వృషభవాహ) 166.

పసులు, తొడుకులు, పసరములు, పసి అనునివి పశువులకుఁ బేళ్ళు.-Cattle. ఆలపోఁతు, బసవఁడు, గిబ్బ, ఆఁబోఁతు అనునివి వృషభము నకున్=ఎద్దునకు, నామములు-Bull. (ఇది సాధారణముగ ఆఁబోఁతున కన్వయించును-Breeding Bull.)

సీ. తొట్టిపట్టు లనంగ ॥ దొడ్లనఁగా నివి
గోష్ఠ దేశమునకుఁ ॥ గొటలు (నీశ)
కదుపులు మొదవులు ॥ పదువులు మందలు
నా ధేనుగణ మొప్పు ॥ (నగనివేశ)
యలరు నాఖ్యలు లేఁగ ॥ లనఁ దూడ లనఁ గ్రేపు

లనవత్సములకును గొ (ధనదమిత్ర)
యా వనంగా గిడ్డి గొ యనం దొడు కన మొద
వన ధేనునామముల్ గొ దనద (నభవ)

తే. యుక్షమునకు సమాఖ్యలై గొ యొప్పుచుండు
గిత్త యెద్దన గోడె నాం గొ (గృత్తివాస)
యా లనంగ ధేనువుల కాఖ్య గొ యలరు చుండు
(శైలజానాథ ప్రమథసం గొ చ యసనాథ) 167

తొట్టిపట్టులు, దొడ్లు, ఇవి కొట్టమునకుఁ బేళ్లు-Cattle-shed., కదుపులు, మొదవులు, పదువులు, మందలు, అనునివి ఆలమందలకుఁ బేళ్ళు-Herds. లేగ, దూడ, క్రేపు అనునివి దూడకుఁ బేళ్లు-Calf. ఆవు, గిడ్డి, తొడుకు, మొదవు ఇవి యావునకుఁ బేళ్ళు – Cow. గిత్త, ఎద్దు, కోడె, అనునివి ఎద్దునకుఁ బేళ్ళు–Ox. ఆలు* అనునది గోసమూహమునకు నామము.

తే. అలరుఁ గుందేలు చెవులపో గొ తనఁగ శశక
మొప్పు బొడల మెకంబు నా గొ దుప్పియనఁగఁ
గాఱుకొమ్ముల మెక మనం గొ గను ధరిత్రి
రామనామమృగంబు (ధ గొ రాశతాంగ) 168

కుందేలు, చెవులపోతు, అనునివి శశకమునకుఁ బేళ్లు – Hare. పొడల మెకము = చుక్కలుగలది, దుప్పి, కాఱుకొమ్ములమృగము=దట్టముగాఁ బెటిగిన కొమ్ములుగలది, అనునివి రామనామమృగంబు=రాముని మొలయించిన జింకవంటిదానికి (ఇఱ్ఱికి) నామములు–Stag.

---

* ఆవులు, ఆవు ప్రభృతులకు బహువచనము పరంబగునపుడు తుదివర్ణమునకు లోపంబు వైకల్పికముగానగును. జాము, జాలు.

తే. దుంత యెనుబోఁతు జమునెక్కి రింత దున్న
యనఁగ మహిషంబునకు సమాహ్వయములమరు
బరఁగు నెనుపెంట్లు గేదెలు బఱ్ఱె లెనుము
లనఁగ మహిషీసమాఖ్యలు (ధనదమిత్ర) 169

దుంత, ఎనుబోఁతు, జమునెక్కిరంత=యముఁడెక్కునది, దున్న అనగ, మహిషంబునకుఁ=దున్నపోఁతునకు, నామములు He-buffalo ఎనుపెంటి=(ఆడు ఎనుము) గేదె, బఱ్ఱె, ఎనుము అనునివి, మహిషీసమాఖ్యలు=బఱ్ఱెకుఁ బేళ్లు-She-Buffalo.

తే. పక్కి పులుఁగు పిట్టయనంగఁ బక్షియొప్పఁ
గఱులు ఱెక్కలు చట్టుప లెఱక లనఁగ
పక్షముల కివి పేళ్ళగుఁ బర్ణములకు
నాఖ్య లగు లావు లన నీకఁ లనఁగ (నీశ) 170

పక్కి (పక్షి—ప్ర) పులుగు, పిట్ట, అనునివి పక్షికిఁ బేళ్ళు-Bird. గఱులు, ఱెక్కలు, చట్టుపలు, ఎఱకలు అనునివి పక్షములకు నామములు - Wings. లావులు, ఈకలు అనునివి ఈకలకు నామములు - Feathers.

సీ. తొలకరి కలుగు పుల్లులు నల్వ తేజీలు
పాలునీరును నేరు పఱచుపులుఁగు
లంచలు తెలిపిట్ట లన నొప్పు హంసలు
క్రౌంచముల్ దనరారుఁ గొంచ లనఁగ
గొక్కెరా లనఁగను గొక్కు లనంగను
గొక్కెరలనఁగను గొంగ లనఁగఁ
బరగుఁ నభిఖ్యలు బకవిహంగములకు
నట్టువ పులుగుఁ నా జుట్టుపులుఁగు

తే. నాఁగఁ నెమ్మిన నెమిలి నా ఽ నమ్మి యనఁగఁ
గేకికిసమాఖ్య లగుఁ జంచ ఽ రీకమునకు
నాఖ్యలు జమిలిముక్కాలి ఽ యనఁగ దేటిఁ
యనఁగఁ దుమ్మెద నా (నీల ఽ యభ్రకేశ) 171

తొలకరికలుగుపుల్గులు=వర్షాకాలమునందు పఱుగిడుపిట్టలు, (వర్షా కాలమున నివి మానససరోవరమునకుఁ బోవును) నల్వతేజీలు=బ్రహ్మకు వాహనములు, పాలునీరు నేరుపఱచు పులుగులు = క్షీరనీరముల వేరు చేయఁగల పక్షులు, అంచలు (హంసలు—ప్ర) తెలిపిట్టలు=తెల్లనిపక్షులు, అనునివి హంసలకుఁ బేళ్ళు—Swans. కొంచలు అను పేరు క్రౌంచ (బెగ్గురు) పక్షికిఁ జెల్లును. కొక్కెరాలు, కొక్కులు, కొక్కెరలు, కొంగలు అనునివి, బకమునకుఁ బేళ్లు-Stork. నట్టువపులుగు=నాట్య మాడు పక్షి, జుట్టుపులుగు=జుట్టుండు పక్షి, నెమ్మి, నెమిలి, నమ్మి, అనునివి, కేకికిన్ = నెమలికి, పేళ్ళు - Peacock. జమిలిముక్కాలి= మూడుజంటల కాళ్ళుగలది, తేటి, తుమ్మెద, అనునివి భ్రమరమునకుఁ బేళ్ళు - Bee.

తే. పరఁగు నొడ్డీలు కూకీలు ఽ పల్లటీలు
పావురాలును బకదార్లు ఽ పావురములు
నాఁగఁ గలరవపక్షి బృం ఽ దముల పేళ్లు
(పంకజాతాక్షసన్మిత్ర ఽ ఫాలనేత్ర) 172

పంకజాతాక్ష సన్మిత్ర=పుండరీకాక్షుఁడగు విష్ణునకు మిత్రమైన వాఁడా! ఫాలనేత్ర=నొసటఁ గనుఁలుగలవాఁడా! ఒడ్డీలు, కూకీలు, పల్లటీలు, పావురాలు, బకదార్లు, పావురములు, అనునివి, కలరవపక్షి బృందములకున్ = మనోహరమైన శబ్దముచేయు పావురముల గుంపునకు నామములు. Doves.

తే. పుడమిలోపలఁ జదువుల ౯ పులుగనంగఁ
జిగురువిల్కాని తేజి నాఁ ౯ దొగరు ముక్కు
పులుఁ గనఁగఁ బచ్చతెక్కల ౯ పులుఁగనంగఁ
జిలుక యన నొప్పుఁ గీరంబు ౯ (శ్రీమహేశ) 173

చదువుల పులుఁగు=మాటలాడుపక్షి, చిగురువిల్కాని తేజి=మన్మథునకు వాహనము, తొగరుముక్కు పులుఁగు = ఎఱ్ఱనిముక్కుగల పక్షి, పచ్చతెక్కల పులుగు = ఆకుపచ్చని తెక్కలుగలది, చిలుక, అనునివి, కీరమునకు, నామములు. Parrot.

తే. బట్టికాఁడన గొరవంక పిట్టయనఁగఁ
బరఁగు శారిక యేట్రింత ౯ పసులపోలి
గాఁడు కూఁకటిమూఁగ నాఁ ౯ గను జెలంగు
నిల భరద్వాజవిహగంబు ౯ కృత్తివాస) 174

బట్టికాఁడు, గొరవంకపిట్ట, అనునివి, శారికకును=గోరువంక పక్షికి, నామములు. ఏట్రింత, పసులపోలిగాఁడు, కూఁకటిమూఁగ. అను నివి, భరద్వాజపక్షికి నామములు.

తే. జాలె డేగ నః గురుజు నా ౯ సాళ్వ మనఁగఁ
గణుజు నాఁగను జలకట్టె ౯ యనంగ వేస
డం బనఁగ గిడ్డు నా నోర ౯ ణం బనంగ
శ్యేనభేదంబులగు (మహా ౯ సేన జనక) 175

మహాసేన జనక=కుమారస్వామికిఁ దండ్రియైనవాఁడా! జాలె, డేగ, గురుజు, సాళ్వము, కణుజు, జలకట్టె, వేసడము, గిడ్డు, ఓరణము, అనునివి శ్యేనభేదములు = గ్రద్దలలోగల తెగలకుఁబేళ్లు.

తే. కోటఁ డనఁగను గూబనా ॥ ఘూకమమరుఁ
జిలుతగూబ యనంగఁ బ ॥ సిండికంటి
యనఁగ సకినాలపులుఁ గన ॥ నలరుచుండు
బృథివిఁ గనకాక్షి (॥ యనుపక్షి(శ్రీమహేశ) 176

కోటఁడు, గూబ అనగా, ఘూకమమరుఁ =గుడ్లగూబ, ఒప్పును. Owl. చిలుతగూబ, పసిండికంటి= బంగారువంటి కన్నుగలది, సకినాలపులుఁగు (శకునము ప్ర—సకినము—వి.) = శకునముల పక్షి, అనిన, కనకాక్షి యనుపక్షి పేళ్ళు. Golden-eyed bird.

తే. పాము సప్పంబు నిడుపఁడు ॥ పడఁగదారి
గాలిమేఁతరి విసదారి ॥ కానరాని
కాళ్ళయది చిల్వ వీనుల ॥ కంటి పుట్ట
పెట్టెపట్టనఁ జను నహి ॥ పేళ్లు భర్గ 177

పాము, సప్పము (సర్పము—ప్ర), నిడుపడు = చిరకాలము జీవించునది, పడఁగదారి=పడగగలది, (ధారి-ప్ర) గాలిమేతరి=గాలినితినునది, విసదారి=(కోరల) విషము ధరించునది, కానరాని కాళ్ల యది=కాళ్లు పెళ్లగు పడనిది; చిల్వ, వీనులకంటి = చెవులు కన్నులుగాఁగలది. పుట్టపెట్టె పట్టు = పుట్టలు, పెట్టెలు నివాసముగాఁగలది. అనగా, అహి = పాము ఒప్పును, Snake.

క. ఇల నెంచ రుధిరమున కా
ఖ్యలు నల్ల యనంగ నెత్తురనఁగ ధరిత్రిం
బొల యీరు వెఱచి ॥ నంజుడు
పొల సన నివి పరఁగు మాంస ॥ మునకు (మహేశా)

నల్ల, నెత్తురు, అనగా రుధిరమునకుఁ = రక్తమునకు ఆఖ్యలు.

Blood, (రక్తము నాళములయందుఁ దిరుగునది గాన తిర్యగ్వర్గునందుఁ జేర్పఁబడిన దేమోకాని మాంసమునకిందు ప్రవేశకారణము మృగ్యము), పొల, కూరు, వెఱచి, నంజుడు, పొలసు, అనునివి మాంసమునకుఁ బేళ్లు. Flesh.

క. భర్గుఁడు కాశీనిలయుఁడు
దుర్గాపతి యొసఁగు ముదముగ తో నీతిర్య
గ్వర్గు లిఖించినఁ జదివిన
దార్గత్యము లణఁచి సంపదలు నిత్యంబున్ 179

తా॥ ఈ తిర్యగ్వర్గును జదివినవారికిని, వ్రాసినవారికిని కాశీ నివాసుఁడైన, పార్వతీదేవికిఁ బతియైన భర్గుఁడు దారిద్ర్యములనణచి (పాపములందు పడుట నుడిపి) నిరంతర సంపదల సంతసముతో నిచ్చును.

---

## నా నా ర్థ వ ర్గు.

వివిధార్థములుగల పదసముదాయము.

Wods with different meanings.

పైవర్గులందుఁ బర్యాయపదముల వ్రాయుచు, నపుడర్థాంతరము దోచిన పదములనన్నిటిఁ గూర్చి యీ వర్గమును కవి వ్రాయుచున్నాఁడు. అమరసింహుఁడు నిటులే యొనరించెను.

క. కలుపనఁ బేరగు దధికిం
గలు పన సస్యంబులోని గ గాదముపే రా
వెలు గంద్రు కంపకోటను
వెలుగందురు ప్రభను జనులు గ (విశ్వాధిపతీ) 180

కలుపు=పెరుగు; పైరులోనుండు గడ్డి, వెలుగు=కంచె, వెలుతురు. (వెలుతురను నర్థమువచ్చుటకు వెలుఁగు అని వ్రాయవలెను. ఉచ్చారణ

మున నర్థానుస్వారపుటునికి గమనింపఁబడదు గనుక కవి యిటు వ్రాసి యున్నాఁడు.)

క. మావు లనం దగు హయములు
మావు లనం బరఁగు నామ్ర మహిజంబు లిలం
దావు లన స్థలము లొప్పును
దావు లనన్ వాసనలకుఁ దగుఁ బేరు (శివా) 181

మావులు=గుఱ్ఱములు, మామిడిచెట్లు. (ఇక్కడ మావులనుబహు వచన ప్రయోగమునకే నానార్థములు. దీనిఁబట్టి ఏకవచనము మావి యనగా గుఱ్ఱమని చెప్పరాదు, మావు అనవలెను.) తావులు=వాసనలు. చోట్లు. పైదానివలెనివియు బహువచనమే గ్రాహ్యము, (ఏకవచనము. తావి = వాసన; తావు = స్థలము)

క. ఇమ్మహిలోపలఁ బే రగుఁ
గొమ్మ యనన్ వృక్షశాఖ కును భామినికిం
దమ్ము లన బే రగుఁ బ
దమ్ముల కనుజన్ములకును (దరుణేందుధరా) 182

కొమ్మ = శాఖ, స్త్రీ, తమ్ములు = పద్మములు, కనిష్ఠ సోదరులు. (ఏకవచనము తమ్మి = పద్మము, తమ్ముఁడు—సోదరుఁడు)

క. ఇమ్ములఁ బే రగుఁ దాటం
కమ్ములకున్ లేఖలకును గమ్మలనన్ నా
మమ్ము దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె నా (గౌరీశా) 183

కమ్మలు = కర్ణభూషణములు, జాబులు; తీఁగె = మెడలోని సొమ్ము, లత.

క. చెల్లును జేళ్లై ధరలోఁ
దాళ్లన సూత్రంబులకును ౫ దాళంబులకుం
గోళ్లనఁ గుక్కుటములకును
జేళ్లగు ఖట్వాంగములకుఁ ౫ జేళ్లగు (నభవా) 184

తాళ్లు=పగ్గములు, తాటిచెట్లు, (ఏకవచనము, తాడు, తాడియని యొలుఁగవలెను) కోళ్లు = మంచపుఁగోళ్ళు, కుక్కుటములు. (ఏకవచన రూపములు కోడు, కోడి)

క. చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్య యగుచుఁ ౫ బరఁగు ధరిత్రిన్
నామము లగుచును వెలయును
బాము లనన్ జన్మములకు ౫ భంగమ్ములకున్ 185

చామ = ఒకవిధమైన పైరు, స్త్రీ. బాము = పుట్టుక, తీరపాకారము లేక కష్టములు,

తే. దంట యనఁగ నభిఖ్యయై ౫ దనరుచుండు
జగతిలోపలఁ బ్రౌఢకు ౫ యుగళమునకుఁ
బఱు పనంగ నభిఖ్య యా ౫ బానుపునకు
విస్తృతమునకు (శైలని ౫ వేశ యీశ) 186

దంట = ప్రౌఢయైన యాడుది, జంట; పఱపు = పడక, వ్యాప్తి.

క. తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు సుషిర ౫ మునకును ధరలో
వెలయనఁగ బహిర్ధవళం
బులకును నామంబు (శేష ౫ భుజగవిభూషా) 187

తొలి = ఇంతకుముందు, బెజ్జము; వెలి = వెలుపల, తెల్లఁదనము

క. నెమ్మి యనఁ బంజుల వృ
క్షమ్మునకున్ బర్హికిని సు । ఖస్థితికిని నా
మమ్ముగఁదగు (నతిధీర యు
హమ్మతి జనదూర పన్న । గాధిపహారా) 188

నెమ్మి=వంజులవృక్షము, నెమిలిపక్షి ; సుఖముపైనుండుట.

క. పోలం బేరఁగుచుండును
బాలనగా క్షీరమునకు । భాగంబునకుం
గాలనఁ బేరగు నాలవ
పాలికిఁ బాదంబునకును । (బాలేందుధరా) 189

పాలు = క్షీరము, భాగము ; కాలు=పాదము, నాలవభాగము.

క. మేలన శుభంబు పేరగు
మేలన నుపరికిని గూరి । మికినిం బేరా
మేలన మెచ్చునఁ బల్కిన
యాలాపంబునకు నాఖ్య । యగు (జగదీశా) 190

మేలు=శుభము, పైభాగము ; ప్రేమ, హితమైనమాట.

కె. ధారుణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁదువాద్య । మును శాల్మలియుం
బేరన నభిదానం బగు
హారమునకు నామమునకు । (నంబరకేశా) 191

బూరుగు=వాద్యవిశేషము, బూరుగమ్రాను ; పేరు=నామము, మెడలో నిడండ,

క. కప్పన నీలిమ పేరగుఁ
గప్పనఁగా నింటిమీఁది ♦ కసవుకుఁ బేరౌఁ
గొప్పనఁ దగుఁ జాపాగ్రము
నొప్పగు ధమ్మిల్లమునకు ♦ హరోపరియు(శివా) 192

కప్పు=నలుపు, ఇంటిమీది కప్పు; కొప్పు=స్త్రీలకొప్పు, వింటికొన, ఇంటి నడుకొన.

క. ఒకభూరుహమునకును ధమ
నికిఁ బేరగుఁ గ్రోవి యనఁగ ♦ నెఱి నట్టుల వే
ఱొక భూజమునకు నధరము
నకుఁ బేరగు మోవి యనిన ♦ (నగరాట్చాపా) 193

క్రోవి=గొరింట, గొట్టము; మోవి=పెదవి, ఒకానొక చెట్టు.

క. చవు లనగా నభిధానము
లవుమద్రుచులకును ముత్తి ♦ యపు పెత్తులకుఁ
భువిలోపల నామము లగు
గవు లన గుహలకునుఁ బూతి ♦ గంధంబులకుఁ 194

చవులు=నోటి రుచులు, ముత్తెపు దండలు; గవులు=గుహలు, చెడ్డవాసన (గుహాయర్థమగుచో గవియగును. వాసనయను నర్థమున నిది యేక వచనమే యగును).

తే. ఆఖ్యయై యొప్పు ధరణిలో ♦ నపరదివస
మునకు ఛత్రంబునకు నెల్లి ♦ యనెడినుడువు
జక్కి యనుపేరు పరఁగును ♦ సైంధవంబు
నకు ఘరట్టంబునకును (గం ♦ దర్పదమన) 195

ఎల్లి=రేపు, గొడుగు; జక్కి=గుఱ్ఱము, తిరుగలి.

తే. ఆడె ననుమాట నటియించె ॥ ననుటకును వ
చించె ననుటకు మఱియు నిం ॥ దించె ననుట
కాఖ్య యగుచును శోభిల్లు ॥ నాలు నాఁగ
గోవులకు భార్యకును బే ర ॥ గు (స్మహేశ) 196

ఆడెను=నాట్యము చేసెను, పలికెను, నిందించెను. ఆలు=గోవులు. (దీని కేకవచనము ఆవు,) భార్య (దీనికి బహువచనరూపము ఆండ్రు; ఈ రెండును సూత్రములచే సాధింపఁబడిన రూపములు)

సీ. రజత పునఃపదా ॥ ర్థములకు నభిదాన
మగు వెండి యన బంతి ॥ యనఁగ గందు
కమునకు శ్రేణికి ॥ నమరు నాహ్వయముగా
దండ యనం బుష్ప ॥ దామమునకు
నంతికంబునకుఁ బే ॥ రగు దొర యన నాఖ్య
యగు సదృశమునకు ॥ నవనిపతికి
న స్త్రిసంఖ్యకు నహ ॥ మ్మనుటకు నాహ్వయం
బగు నే ననఁగ సరి ॥ యనఁగ సదృశ

తే. మునకు సమసంఖ్యకును నామ ॥ ముగ నెసంగు
గొంతనఁగ నాహ్వయం బగుఁ ॥ గుక్కుటాస
నంబునకుఁ గంఠమునకును ॥ నల్ల యనిన
రక్తనీలాఖ్యయై యొప్పు ॥ (రాజమకుట) 197

వెండి=రజితము, మరల; బంతి=చెండు, వరుస (దీనికి పంక్తి యని ప్రకృతి) దండ=పుష్పహారము, సమీపము; దొర=సమానము, రాజు; ఏను=అయిదు, నేను (నీమీ నే మేల తొలి హల్లునకు లోపమను సూత్రమున ఏను ఏర్పడినది), సరి=సమానము, సరి సంఖ్య (ఒప్పుదల చూపుట కనుపదము) గొంతు=కుక్కుటాసనము, మెడ; నల్ల=నెత్తురు, నలుపు.

సీ. తీరంబునకు ధరి ♦ త్రీధరంబునకు స
మాఖ్యమై యొప్పఁగ ♦ ట్టనఁగ [నీశ]
కేతువునకుఁ గాంతి ♦ కిని సమాహ్వాయ మగు
డా లనంగను [మేరు ♦ శైలచాప]
శౌర్యధుర్యునకు లాం ♦ ఛనమునకును నామ
మగు బిరు దనఁగఁ [బ ♦ న్నగవిభూష]
గూబ నా నాఖ్య యా ♦ ఘూకఁబునకుఁ గర్ణ
మూలంబు కు [నవి ♦ ముక్తనిలయ]
తే. యంతికంబునకును సమూ ♦ హంబునకును
నామమై యొప్పుఁ జేరువ ♦ నాఁగ (నభవ)
సమభిధానమైయొప్పుఁ బి ♦ శాచమునకు
బవనమునకును గాలి యు ♦ న్పలుకు (రుద్ర) 198

గట్టు = తీరము, కొండ; డాలు = డెక్క్యము, కాంతి; బిరుదు = శౌర్యము, గురుతు; గూబ = గుడ్లగూబ, చెవిలోపలి భాగము; చేరువ = దగ్గఱ, గుంపు; గాలి = దయ్యము (పిశాచబాధ), వాయువు.

క. ఇలలోపల నామం బగు
బలుకులు నాశకలములకు ♦ భాషణములకుఁ
నెల యన నభిధానం బగు
జలజారికి మాసమునకు ♦ (శైలనిశాంతా) 199

పలుకు = మాట, తుంట; నెల = చంద్రుఁడు, మాసము.

సీ. అంతర్హితుం డయ్యె ♦ ననుటకు నాగతుం
డయ్యె ననుటకును స ♦ మాఖ్య యగుచు
నలరును విచ్చేసెన ♦ ననుట (యంబరకేశ)

నెఱి సమాహ్వాయ మగుఁ × గఱచె ననఁగ
నభ్యాస మొనరించె ననుటకు దంతపీ
డ యొనర్చె ననుటకు × (నయుగనయన)
వెలయుఁ దప్తక్షీర × ములకు నభిజ్ఞకు
నాఖ్యయై యానవా × లనుట (యీశ)
తే. పఱచె ననఁగ సమాఖ్యయా బాధచేసెఁ
ప్రచలితుం డయ్యెననుటకు (పాండురాంగ)
పరఁగ మోహించె ననుటకుఁ × బరిమళించె
ననుట కొప్పును వలచె నా × (నళికనేత్ర) 200

విచ్చేసెను = వచ్చెను, కనుబడకపోయెను; కఱచెను = నేర్చుకొనెను; కొఱికెను; ఆనవాలు=కాగినపాలు, గుఱుతు. పఱచెను = కష్టపెట్టెను, పయనమయ్యెను; వలచెను=కోరెను, వాసనకలిగించెను.

సీ. అనె నంట సమాఖ్య × యాను వహించెఁ బా
నము చేసె ననుటకు × (నగనివేశ)
చషకంబునకును దం × ష్ట్రికు నాఖ్య యాఁగోర
యనఁగ (శశాంకక × ళావతంస)
మొక్కలీఁడనఁగ గొ × మ్ములు లేని కరికి ము
ష్కరుడనఁ బేరగు × (గరళకంఠ)
మరకతచ్ఛవికి నం × బరమున కగుఁ బేరు
పచ్చడం బనిన (నం × బాకళత్ర)
తే. క్షితిని దురగీపతికి వృత్త × శిలకు నామ
ధేయమై యొప్పు గుండునాఁ × (త్రిపురహరణ)
నామ మానొక్కసస్యంబు × నకును లోప
మునకుఁ గొఱ్ఱయనంగ (నం × బుదనిభాంగ) 201

ఆసెను=మోచెను, త్రాగెను; కోర=గిన్నె, పెద్దపల్లు; మొక్క లీడు=కొమ్ములులేని ఏనుగు, మూర్ఖుఁడు; పచ్చడము=పచ్చలకాంతి; పైవేసికొను వస్త్రము; గుండు=మగగుఱ్ఱము, గుండ్రనిబండ; కొఱ్ఱ= ఒక ధాన్యము, కొఱఁత.

సీ. తాల్చునాఖ్యను వధూ ॥ ధమ్మిల్లభారంబుఁ
గోణంబు మూల నాఁ ॥ (గుధరచాప)
గొఱ యనునాఖ్యచేఁ ॥ గొఱలు లోపంబు మ
నోజ్ఞవస్తువు (దక్ష ॥ యజ్ఞమథన)
నెటి హేయపడియె న ॥ న్వేషించె ననురెంటి
కాఖ్యయారోసె నా ॥ (నసితకంఠ)
నరసె నాఁ బేరగు ॥ నార్తి వారించె వి
మర్శించె ననుటకు ॥ (మదనదమన)
తే. చరణమునకు నధఃప్రదే ॥ శంబునకు స
మాఖ్యయై యొప్పు నడుగునా ॥ (నళికనేత్ర)
మహిని బేరగుచుండుఁ బ్ర ॥ మాణికంబు
నకును భాషకు బాసనా ॥ నగనివేశ) 202

మూల=స్త్రీలకొప్పు, దిక్కుల మధ్యదేశము; కొఱ=ఒకధాన్యము (కొఱ్ఱ), ఇంపైన వస్తువు; రోసెను=వెగటును పొందెను, వెదకెను. (రెంటికిని ధాతువు రోయు), అరసెను=బాధను తొలగించెను, విచా రించెను; అడుగు=పాదము, దాని క్రింది భాగము. (పండ్రెండంగుళ ముల నిడివి), బాస=ఒట్టు, భాష.

సీ. నాగవాస మన ఘం ॥ టాప్రతీకమునకు
వేశ్యల కగుఁ బేరు ॥ (విశ్వనాథ)
నామ మా నండంబు ॥ నకు నంధకునకును
గ్రుడ్డనంగను [ రౌప్య ॥ కుధరనిలయ ]

చర్మవాద్యమున కుఁ ॥ ష్ణమునకుఁ బేరగు
నుడు కనియెడునాఖ్య ॥ [యుడుపమకుట]
యభిదాన మగు మేడి ॥ యన హాలాంగమునకు
దుంబరమునకును ॥ [ధూతకలుష]

తే. కల్ల నంగ శిల సురయు నా ॥ (గరళకంఠ)
పరఁగు నాఖ్యయు లాంగల ॥ పద్ధతికిని
శ్రేణికిని జాలనంగ [భా ॥ సితసితాంగ
వారధినిషంగ కాశీనివాసలింగ] 203

నాగవాసము=గంటలోనిచీల, వేశ్యలగుంపు; గ్రుడ్డు=కన్నులు కానరానివాఁడు, అండము; ఉడుకు=ఒకానొక వాయిద్యము, వేడిమి; మేఁడి=(మేఁడితోక) నాగటికొయ్య, అత్తిచెట్టు (ఇదియగునపుడర్ధానుస్వారముండదు, మేడి) కల్లు=ఱాయి (ఇది కర్ణాటకపదము), మద్యము; చాలు=వరుస, నాఁగటిచాలు.

తే. జననికిని మాతృజననికి ॥ జనకజనని
కాఖ్య యగు నవ్వ యనఁగ [నా ॥ ర్యాసహాయ]
భగినికిని జనకునకు నా ॥ హ్వాయము దనరు
నప్ప యనఁగను [జంద్ర రే ॥ ఖావతంస] 204

అవ్వ=తల్లి, (అంబా శబ్దభవము), తల్లి తల్లి, తండ్రి తల్లి (జేజి యని ప్రయోగము) అప్ప=అక్క, తండ్రి (కర్నాటక ప్రయోగము)

క. పో తనఁగఁ బరఁగు మహిషము
భూతలమునఁ బురుషమృగము ॥ బురుషఖగంబుం
దాతన ధాతృ పితామహ
మాతామహులకునుసగుసమాఖ్య(మహేశా) 205

పోతు=దున్నపోతు, పురుషమృగము, మగపక్షి (దీనికి మహాత్మ్యర్థకము—పెంటి) తాత=బ్రహ్మ, తల్లి తండ్రి, తండ్రి తండ్రి.

క. పుడమిని బేరు వహించును
వడిగలవాఁడనఁగ శౌర్య | వంతుఁడు జవియున్
నడు మన నవలగ్నముఁ జె
న్నడరఁగ మధ్యస్థలంబు | నగు [నగధన్వి] 206

వడిగలవాఁడు=శూరుఁడు, వేగముగలవాఁడు; నడుము=దేహపు నడుము, దేనిదైన మధ్యభాగము (జవముగలవాఁడు=జవి).

క. ఎద యనఁగఁ బరఁగు భీతికి
హృదయమునకు వక్షమునకు | నిల జోడనఁగా
నది దనరు నామ మగుచును
సదృశమునకు వర్మమునకు | [జంద్రార్థధరా] 207

ఎద=భయము, హృదయము; జోడు=కవచము, సమానము.

క. నానార్థవర్గు విది స
న్మానముతో దీనిఁ జదివినను వ్రాసిన నా
మానవుల కబ్బునెప్పుడు
నానార్థంబులు విశ్వ | నాథుని కరుణన్. 208

తా॥ అభిమానముతో నీ నానార్థవర్గును చదివినవారికిని, వ్రాసినవారికిని, విశ్వనాథుని దయావిశేషమువ నానా (పురుషా)ర్థములు లభించును.

గద్యము. ఇది శ్రీమదేకామ్రమంత్రిపుత్త్రి కౌండిన్య గోత్రపవిత్ర సదారాధిత మహేశ్వర పైఁడిపాటి లక్ష్మణకవి ప్రణీతంబైన యాంధ్రనామ సంగ్రహం బను నిఘంటువునందు సర్వంబు నేకాశ్వాసము.

B. N. K. Press, Madras. Q. H. No. M. S. 100/B.
For K. L. No. 1—1000—4-26.